

"సరస్వతి నమస్తుభ్యం..."

ఫొటో: జి. రామమోహన్—చోడవరం.

సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

## సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 49
సంచిక 22
**1-2-56**

మన్మథ పుష్య బహుళ పంచమి బుధవారం

మహాత్మా
గాంధి



వర్ధంతి
జనవరి
**30** వ తేది

దారి చూపు కరుణామయ జ్యోతీ!
పరివ్యాప్త మహాధ్వాంత మధ్యంలో -
నిలిచినాను, నడిపించుము నను ముందుకు!
సాంద్రతిమిరభరితము నిశి, కడు దూరము నా గేహము;
దారి చూపి మునుముందుకు నడిపించుము కరుణామయి!
అడుగడుగున తడబడు నా అడుగులలో శక్తి నింపు!
అడుగను లే నా పథమున కావలి కొన చూపుమంచు,
ఒకటే ఒక అడుగైనా క్రమియించిన చాలును తే!

# విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

"ఆన్ బాన్" హిందీచిత్రంలో నళినీ జయవంత్.


| | |
|---|---|
| మునిగిన నవ్వు!—పి. గణపతిశాస్త్రి | 4 |
| కట్నం తెచ్చిన పేచీ—మందరపు పద్మ, లలిత | 7 |
| అపూర్వ హంతకులు(సీరియల్)—'వినాయక' | 13 |
| తాంబూలా లిచ్చేశారు—'రవణ' | 21 |
| సినిమా— | 33 |
| అబల—వానమూర్తి | 37 |
| వనితాలోకం—ఇల్లిందల సరస్వతీదేవి | 41 |
| చోళీ డిజైను— | 44 |
| బాలసాహితి: అమాయకులు—'దిలీప్' | 47 |
| బాలగేయం:అల్లుళ్ళపీడ-జంధ్యాల స్వర్ణకుమారి | 49 |
| నేటి బాలురే రేపటి పౌరులు— సింహాద్రి రుక్మిణీకుమారి | 50 |
| సమస్యలతోరణం-అవసరాల రామకృష్ణారావు | 53 |
| కాళహస్తి క్షేత్రం— | 56 |



ఇటీవల భారతదేశం సందర్శింప వచ్చిన పశ్చిమ జర్మనీ ఉపప్రధాని డా॥ ఫ్రాంజ్ బ్లూకర్ తాజ్ మహల్‌ను సందర్శించి నప్పటిచిత్రం.



భారతదేశంలో మంగోలియా రాయబారి శ్రీ బాయన్ బాటర్ ఓచిర్బాట్, ప్రధాని శ్రీ నెహ్రూను జనవరి 19 నాడు సందర్శించారు.

# ముంగిస నవ్వు! ★ పి. గణపతిశాస్త్రి

## ప్రాచీన గాథాలహరి

కౌరవ పాండవ యుద్ధం ముగిసిపోయిన పిమ్మట ధర్మరాజు చేసిన ఆ మహాశ్వమేధ యాగానికి నేల నాలుగు చెరగులనించీ రాజులు సామంతులు మహీసురులు ఋషీశ్వరులు, ఋత్విక్కులు మొదలైన వారంతా వచ్చి ఆ యజ్ఞం యావత్తూ కళ్లారా చూచి ఆనందించారు. అవభృథ స్నానం జరిగిన పిమ్మట వారంతా మంగళ తూర్యాల ఘోషలో ధర్మపుత్రుని శిరస్సుమీద ఆశీస్సులతో బాటు అక్షతలవర్షం కూడా కురిపించారు!

సభామండపంలో సింహాసనాసీనుడై ఉన్న ఆ ధర్మమూర్తి నందరు అనేక విధాలుగా ప్రశంసించారు. అంతటి మహాశ్వమేధయాగము, అంతటి వితరణ, అలాంటి బ్రాహ్మణ సమారాధన ఎన్నడు కనీ వినీ ఎరగమన్నారు వారంతా! ఆ విధంగా దిగ్విజయం చేసి ఆ ధనరాసులన్నీ ఆ రీతిగా ఆ యజ్ఞంలో నిశ్శేషంగా వితరణ చెయ్యడము నేది - ఆ ఒక్క ధర్మమూర్తికే చెల్లిందనీ బలి, దధీచి మొదలైన వారి దాన తత్పరత కూడా ఆ వితరణ ముందు ఎందుకూ కొరగాదనీ వారంతా ముక్తకంఠాలతో ఉద్ఘోషించారు! పిమ్మట మంగళతూర్యాలు దిక్కులుపిక్కటిల్లేటట్లు ఘోరుమని మారుమోగాయి!

ఇంతలో ఆ సభామధ్యంలో ఒక్కసారిగా ఉవ్వెత్తుగా కలకల హాసం చెలరేగింది! ఆ నవ్వు మానవుని నవ్వులా వినిపించలేదు! అది ఏదో విచిత్రమైన కలకల నవ్వు. సభలోని వారంతా నిర్ఘాంతపోయి సభామధ్యవేదిక కేసి రెప్పపాటు లేకుండా చూచారు. ఆ నవ్వు అంతకంతకు శ్రుతిమించి పోయింది. నిశ్చలంగా నిశ్శబ్దంగా ఉన్న సభలో ఆ కలకల హాసం తప్ప మరేవిధమైన ధ్వనీ వినిపించలేదు!

ఆ సభామధ్యలో ఒక ముంగిస వేదిక కాళ్ళమీద నిలబడి ఆదేపనిగా నవ్వుతూంది! దాని శరీరం శిరస్సు మొదలు నడుంవరకు అంతా బంగారమే! మిగిలిన సగము సామాన్యంగానే ఉంది! ఆ విచిత్రం చూచి అందరు ఆశ్చర్యపోయారు! దాని బంగారు శరీరం కాంతులు సభామండపంలో అంతటా అగ్నిజ్వాలల్లా వ్యాపిస్తున్నాయి. ఆ ముంగిస గుక్క తిప్పుకోకుండా ఇంకా అలాగే నవ్వుతూంది!

ఆసభలో కొందరది ఏదో మహాశ్చర్య సూచన అనుకున్నారు. మరికొందరది గొప్పఅరిష్టసూచకమనీ వెంటనే ఆ అరిష్ట శాంతి చేయించాలని అన్నారు. ఇంతలో ఆ బంగారు ముంగిసే ఆ సభాస్తారుల నుద్దేశించి ఇలాగన్నది!

"ఆహా! ఏమి మీ భాగ్యములు! ఈ బాగోతాలాలకిస్తూంటే నోరువాయీ లేని నాకు కూడా లోలోపల నవ్వు, మాటలు పొంగి పొంగి పైకి వస్తున్నాయి!" అని ఆముంగిస మళ్లీ కలకలా నవ్వింది! సభ్యులెవరికీ ఊపిరికూడా ఆడడంలేదు! ఆముంగిస తన నవ్వంతా అతి కష్టంమీద తమాయించుకుని తిరిగి ఇలాగన్నది:

"మీరంతా ఈయాగము, ఈదానధర్మాలు చూచి కేవలం వందిమాగధుల లాగ కైవారాలు చేస్తున్నారు! కాని ఒక్క బక్కచిక్కిన పేద బ్రాహ్మణుని వితరణ కాలి గోటికి కూడా ఇది సరిపోలదు! ధర్మరాజు బ్రహ్మణ్యుడే! ఆయన అశ్వమేధయాగము అంతటిదే! కాని ఆ బ్రాహ్మణుని వితరణకు దీనికీ హస్తిమశకాంతరం! కొంచం ఆలకిస్తే ఆవిషయం మీకే విశదం కాగలదు. దయచేసి సావధాన చిత్తాలతో చిత్తగించండి!"

పిమ్మట ఆ ముంగిస ఆ బ్రాహ్మణుని త్యాగవృత్తాంతం అంతా ఈవిధంగా చెప్పింది. సభాస్తారులంతా చిత్రప్రతిమల్లా నిశ్చేష్టులై అది విన్నారు.

"ఆహా! కురుక్షేత్రంలో సక్తుప్రస్థుడెంతటి మహానుభావుడు! ఆ బ్రాహ్మణుడు వరిచేలల్లో రాలిన ధాన్యంగింజ లేరుకుని అవి దంపించి ఆ వరిపిండితోనే జీవితం గడుపుకొనేవాడు. ఆయన భార్య, కుమారుడు కోడలు కూడా అన్ని విధాలా ఆయనకు తలలో నాలుకలా మసులుకొనేవారు. ఒక నాటికి సరిపడిన ధాన్యంగింజల కంటెవారు ఒక్కగింజకూడా ఎక్కువగా తెచ్చేవారు కారు! ఆసక్తుప్రస్థుడు మహాతపశ్శాలి. తనకు కలిగిన దానితోనే తన కుటీరానికి వచ్చిన అతిథులను, అభ్యాగతులను ఎంతో ఆప్యాయంగా సంతృప్తి పొందించేవాడు!

ఇలాగ ఉండగా కొంతకాలానికొక ద్వాదశవర్ష క్షామం వచ్చింది. ఆ క్షామంలో ఎన్నెన్నో జీవరాసులన్నంలేక హాహాకారాలు చేశాయి. ఒక సంవత్సరమా! రెండు సంవత్సరాలా! అది పన్నెండేళ్ళ కరువు! ఆకరువులలో ఎందరెందరో 'అన్నమో రామచంద్రా!' అని ఆక్రందిస్తూ అలాగే ప్రాణాలు విడిచారు!

పాపం! ఆక్షామంలో ఆ సక్తుప్రస్థుడు, ఆయన కుటుంబము ధాన్యం గింజలు దొరకక ఎన్నెన్నో కటిక ఉపవాసాలు చేసేవారు. అయినా ఒక్కనాడు వారు రేపటికని చెప్పి ఒక్కగుప్పెడు ధాన్యం గింజలు కూడా నిలవచెయ్యలేదు!

ఆ బ్రాహ్మణుడు ఆ ఉంఛవృత్తి అలాగే అసిధారావ్రతంగా పాలించేవాడు! ఆహా! ఏమి ఆ మహానుభావుని ధర్మనిరతి!

ఆ కరువలాగే పెద్ద పెనుగాలువులాగ ప్రాణులన్నిటినీ మలమల మాడ్చివేసింది. ఆ సక్తుప్రస్థుని కుటుంబం వారంతా చాలాకాలం ఆహారంలేక బక్కచిక్కిపోయారు! అయినా వారెవరినీ నోరుతెరిచి అన్నం అర్థించలేదు! అలాగే పొలాల్లో రాలిన ధాన్యం గింజ లేరుకుంటూ వాటితోనే జీవించేవారు. అలాగ కొన్నాళ్ళపాటు ఒక్కొక్కటిగా ధాన్యం గింజలు సేకరించగా సేకరించగా కొంతకాలానికి కడిమానెడు గింజలైనాయి. వారొకనాడు ఆ గింజలన్నీ దంచి పిండిచేసుకున్నారు. ఆ పిండి నలుగురు నాలుగు సమానభాగాలు చేసుకున్నారు. సక్తుప్రస్థుడు స్నానసంధ్యాదులు నిర్వర్తించుకొని తనభాగం ఆరగింతామని అనుకున్నాడు.

ఇంతలో ఆయన కనతిదూరంలో ఒక అతిథి కనిపించాడు. అప్పటికప్పుడే రెండు

రోజూ మూల కాలం గడిచిపోయింది! ఎండ వేడిమికి తాళలేని కాకులు కావు కావని అరవడానికి కూడా శక్తిలేక సన్నంగా దీనంగా అరుస్తున్నాయి.

ఆ అతిథి కుటీరాని కల్లంత దూరంలో ఉండగానే సక్తుప్రస్థు డాతని కెదురేగి ఎంతో ఆప్యాయంగా లోపలికి తీసుకు వచ్చాడు. అర్ఘ్యపాద్యాదులతో అనేక విధాలుగా సత్కరించి ఆయనకు తనభాగం వడ్డించవలసిందని గృహిణితో అన్నాడు.

ఆ అతిథి అది ఆరగిస్తూంటే ఆ సక్తుప్రస్థు డెంత బ్రహ్మానందభరితు డైనాడు! ఆ అతిథి ఆ సక్తుప్రస్థుని భాగం ఆరగించివేసినాడు. అయినా అతిథి ముఖంలో ఆకలి తీరిన కళ లేమీ కనబడలేదు! పాపం! సక్తుప్రస్థు డదిచూచి కొంచెం దిగులుపడ్డాడు.

అంతలో ఆయన భార్య సక్తుప్రస్థుని లోపలికి పిలిచి తనభాగం కూడా ఆ అతిథి దేవుని కర్పించవలసిందని కోరింది!

ఆయన దాని కంగీకరించలేదు.

"నిన్ను పోషించవలసినది నేనేగదా! మరి నీ ఆహారం నేనెలాగ స్వీకరించగలను!" అన్నాడు.

"మీ అర్ధాంగి కీ ఆతిథ్యసత్కారంలో పాలు పంచకపోవడం ధర్మంకాదు!" అన్నది ఆ బ్రాహ్మణుని ధర్మపత్ని!

సక్తుప్రస్థుడు దీని కేమీ సమాధానం చెప్పలేక పోయినాడు. ఆమె భాగంకూడా ఆ అతిథికి అర్పించివేశాడు. తిరిగీ ఆ అతిథి ఆ భాగంకూడా తినివేశాడు. కాని అతనికి ఆకలి తీరలేదు! సక్తుప్రస్థునికి ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు! అయ్యో! ఒక్క క్షుధార్తునికి కడుపునిండా ఇంత అన్నం కూడా పెట్టలేకపోయానే! అని లోలోపల ఎంతో బాధపడ్డాడు.

ఇంతలో ఆ బ్రాహ్మణుని కుమారుడు తనభాగం కూడా ఆ అతిథికి వడ్డించవలసిందని తల్లితో చెప్పాడు. తల్లి ఒక్క క్షణంకూడా ఆలస్యం కాకుండా ఆ పిండి అతనికి వడ్డించింది. అది తిన్న తరవాత ఆ బ్రాహ్మణుడు కొంత సేదదేరినట్లు కనిపించాడు! సక్తుప్రస్థుడు అది చూచి కొంచెం సంతోషించాడు.

సక్తుప్రస్థుని భార్య ఎంతోఆప్యాయంగా ఆ అతిథితో "బాబూ! ఇంకా కొంచెం తీసుకోండి!" అన్నది. అతిథి అంతే అంటవట్టుగా అక్కర్లేదనబోయి ఇంకా కొంచెం కావాలన్నాడు.

ఆమె తనఅలవాటుప్రకారం అన్నదేగాని కుటీరంలో ఇక ఒక్క కోడలు భాగంతప్ప మరి వేరే ఆహారమేమీ లేదని ఆమెకు తెలియదు! కాని ఏమి చెయ్యడానికీ పాలుపోక లోపలికి వెళ్ళిపోయింది! ఆ గృహస్థు కూడా లోపలికి వెళ్ళాడు! అంతలోనే కోడలు తన భాగం కూడా తీసుకువచ్చి అత్తగారి కందీయబోయింది! ఆమె కొంతసేపు అది వద్దనడానికిగాని, స్వీకరించడానికి గాని శక్తిలేక అల్లాగే కొయ్యబొమ్మలా నిలబడిపోయింది! లోపలికివచ్చిన సక్తుప్రస్థునికీ సంఘటన చూచేసరికి కళ్ళనీళ్ళు తిరిగాయి. పాపం కోడలు ఆకలితో నీరసపడి ఉన్నా తన భాగం కూడా అతిథికీయవలసిందని అత్తగారిని అనేక విధాలుగా ప్రాధేయపడింది! మరి గత్యంతరం లేక ఆమె ఆ భాగం కూడా అతిథికి అర్పించి వేసింది! ఆ బ్రాహ్మణుడు ఆ భాగంలో కూడా చాలావరకు ఆరగించివేశాడు! తృప్తిగా ఇంత మంచితీర్థం లోపలికి పుచ్చుకుని గ్రుక్కన తేన్చాడు. ఎంత బలవంతం చేసినా ఇక మిగిలిన ఆహారం అక్కరలేదని పరిహరించి వేశాడు!

అతిథికి కావలసిన విధంగా తృప్తి కలిగిందిగదా! అని ఆ సక్తుప్రస్థు డానా డెంతగా సంతోషించాడు! ఆ అతిథి బ్రహ్మానందపడి వారందరినీ ఆశీర్వదించి ప్రశాంతంగా ఇలాగన్నాడు.

"సక్తుప్రస్థా! నీవంటి మహానుభావుడీలోకంలో అవతరించడంవల్లనే సూర్య చంద్రాదులు గతి తప్పకుండా తమతమమార్గాల్లో సంచరిస్తున్నారు! మీ వితరణ చూచి మిమ్మల్ని అందరినీ విమానంలో దివ్యలోకానికి తీసుకు పోవాలనే తహతహతో దేవతలాకాశంలో వేచి ఉన్నారు! అదిగో! ఆకాశంలో ఎంతమంది దేవతలు ఆశ్చర్యముగ్ధులై నిశ్చలంగా నీకోసం నిరీక్షిస్తున్నారో చూడు!"

నేనీ ఘటన అంతా చూస్తూ ఆ ప్రాంతాల్లో సంచరిస్తున్నాను. ఆనందం పట్టలేక ఆ అతిథికి కాళ్లుకడిగిన నీటిలో అటూ ఇటూ తిరిగాను! చిత్రంగా నా శరీరంలో సగంభాగం సువర్ణమయమైపోయి తళతళా మెరిసింది. ఆహా! ఆ సక్తుప్రస్థుని త్యాగము ఆ కుటుంబం ధర్మనిరతి తలుచుకుంటూంటే నా కిప్పటికీ శరీరం గగుర్పొడుస్తూనే ఉంది! అప్పటినించీ నా మిలిగిన శరీరం అంతా సువర్ణమయమై పోగలదనే ఆశతో ఎన్నెన్నో యజ్ఞయాగాలు సందర్శించాను. ఆయా మహారాజులు చక్రవర్తులు, అవభృథ స్నానాలు, దానాలు చేసిన నీటిలో నా శరీరం తడిపాను! కాని నా ప్రయాస ఫలించలేదు.

పిమ్మట కొంతకాలానికి ధర్మదేవత మూర్తీభవించిన ధర్మరాజే అశ్వమేధయాగం చేస్తున్నాడనే శుభవార్త నా చెవులబడింది. నేనెంతో ఆనందించాను! నా ప్రయాస ఈనాటికి ఫలించగలదని అనుకున్నాను.

అందం ఒకప్పుడు స్త్రీల సొమ్ము.

ఇపుడు మాత్రం పౌడర్లూ స్నోలూ అమ్మేవాళ్ల సొత్తు.

ధర్మరాజు మహానుభావుడు. ఆయన చేసిన అశ్వమేథయాగం వంటి మహత్తర యాగం నేనెన్నడు దర్శించలేదు! ఈ యాగంలో ఏవిధమైన లోపములేకుండా సమస్తము సలక్షణంగా జరిగిపోయింది! బ్రాహ్మణు లన్నమాటేమిటి? సమస్త ప్రాణులు ఈ యజ్ఞంలో తృప్తిదీరా భుజించారు! ఈ మహాయాగంలో వేలెత్తి చూపడాని కేలోపములేదు! ఇంతిమంది మహాతపస్సంపన్ను లీవిధంగా స్తోత్రంచేసిన ఈ యజ్ఞము, ఈ వితరణ నిశ్చయంగా మహత్తరమైనవనే నని నేను విశ్వసించాను.

ఆ విశ్వాసంతోనే ఈ యజ్ఞశాల అంతటా తిరిగాను. కాని ఎంతతిరిగినా మిగిలినశరీరం బంగారం కాలేదు! శరీరంమాత్రం ధూళిధూసరితమైపోయింది! అంతే. అవభృథ స్నానం చేసిన ఈ మహారాజు అడుగుజాడల్లో సంచరిస్తే నా శరీరం అంతా బంగారం కాగలదేమో అని చాలా చాలా ఆశించాను. ఇంకా యజ్ఞశాలలో అనేక విధాలుగా ప్రయత్నించాను. కాని నా కోరిక సఫలంకాలేదు!

"అప్పటినించీ ఆ సక్తుప్రస్థుని చరిత్రం నా హృదయంలో అలాగే మెరుస్తూంది! ఆ మహాత్యాగం ముందీయుధిష్ఠిరుని దాన ధర్మా లేపాటివి? కనుకనే ఇక్కడ నా శరీరం మరి సువర్ణం కాలేదు. అయ్యో! ఈ మిగిలిన శరీరం బంగారం కాలేదే అని నేనెంతో కించపడుతూంటే మీమీ కైవారాలు వినిపించాయి. అవి వింటూంటే పెద్దనవ్వు వచ్చింది. ఆ లోలోపలి నవ్వాగక నిండుసభలో మీఅందరి ఎదట ఆవిధంగా నవ్వాను! మరి నాకు సెలవు దయచేయించండి!"

ముంగిస ఆవిధంగా అనర్గళంగా ప్రసంగిస్తున్నంతసేపు సభ సభ అంతా చిత్రప్రతిమలా మారిపోయింది ఆ ముంగిస ఆ విధంగా ప్రసంగించిన తరవాత మరి ఎవరు మాత్రం ఏమనగలరు!

అది అలాగని వెళ్లబోతూంటే ఒక వృద్ధ సదస్యుడు లేచి నిలబడి దానితో ఇలాగన్నాడు.

"ధర్మపుత్రుని అశ్వమేధయాగం అన్ని విధాలా సలక్షణంగా జరిగిపోయిందని నీవే అన్నావు గదా! అయితే సక్తుప్రస్థుని వితరణముందు ఈ యాగము ఈ వితరణ - నీవింతగా కించపరచడానికి హేతువేమిటి?"

దానిమీద ఆముంగిస మళ్లీ ఒక్కసారి కలకల నవ్వింది:

"ఈ సభలో ఇంతమంది బ్రహ్మజ్ఞులైన ధర్మవేత్తలున్నా - ఈ చిన్న ధర్మసందేహం కూడా నేనే తీర్చవలెనా?" అన్నది.

సభలోని వారంతా తిరిగీ వినడానికి పాలుపోక అలాగే నిర్ఘాంతపోయారు. మరికొందరు తలలే వంచేసుకున్నారు! ధర్మరాజాదులందరు ఖిన్నులై దిగాలుపడిపోయారు! కొందరొకరి మొహాలొకరు చూచుకొన్నారు!

ఆ ముంగిస ఒక్క నిమిషం ఊరుకుని తిరిగీ ఇలాగన్నది!

"శత్రువులను సంహరించి, ఈ ధర్మప్రభువు దిగ్విజయంచేసి ఆ హింసార్జితమైన ద్రవ్యంతో ఈ అశ్వమేధయాగం జరిపించినాడు. యజ్ఞం ఎంత సలక్షణంగా జరిగినా హింసాద్రవ్యం హింసాద్రవ్యమే కదా! ఆసక్తుప్రస్థుని ఐహికచర్య సమస్తము అహింసామయంగానే సాగిపోయింది! అందువల్లనే ఆయన వితరణ యజ్ఞం ముందు ఈ అశ్వమేధయాగం ఎందుకూ కొరగాకుండా వెలవెలబోయింది! ఇంతటి అల్పవిషయం కూడా ఈ ధర్మస్థానంలోని ధర్మవేత్తలెవరికీ స్ఫురించలేదంటే నాకు మళ్లీ ఉవ్వెత్తుగా నవ్వు వస్తూంది!" అని చెప్పి ఆ ముంగిస తిరిగీ ఆదేపనిగా కలకలానవ్వడం మొదలుపెట్టింది! ఈసారి ఆ ముంగిస శరీర కాంతులేకాక, నవ్వు వెలుగులు కూడా ఆ సభాస్తంభాల మీద చిత్ర చిత్రంగా ప్రతిఫలించాయి. అందరు శిల్పప్రతిమల లాగ ఆ నవ్వుల సవ్వడులు విన్నారు.

ఆ వింతవింత వెలుగులలో ఏకమైపోతూ ఆ ముంగిస అలాగే అక్కడే అదృశ్యమై మాయమైపోయింది! ★

# కట్నం తెచ్చిన పేచి

ప్రమీల పెళ్ళికి కామేశం, నరసింహం వస్తారని కాని కనీసం శారదా, హేమలనైనా పంపిస్తారని కాని జగన్నాథం అట్టే ఆశలు పెట్టుకోలేదు శ్యామల పెళ్ళినాడు జగన్నాథం దురదృష్టం కొద్దీ కామేశానికీ, నరసింహానికీ అతని మీద బాగా కోపం వచ్చింది. అంతే - మళ్ళా శారదా, హేమా యింతవరకు పుట్టింటి గడప తొక్కనేలేదు. కనీసం వాళ్ళదగ్గర నుండి కార్డు ముక్కైనా రాలేదు.

అలాగని జగన్నాథం ఏ లోపమూ చేయలేదు. శుభలేఖలు పంపించాడు. దాంతోపాటు తన తప్పులన్నీ క్షమించి పెళ్ళికి తప్పక రావలిసిందంటూ ఉత్తరాలు వ్రాశాడు, మనుష్యుల్ని పంపించాడు - ఇన్నీ చేసి దేవుడి దయవుంటే వస్తారు. లేకపోతే లేదని - దేవుడిమీద భారం వేసి కూర్చున్నాడు. పెళ్ళిదగ్గర పడుతున్న కొద్దీ వాళ్ళజాడ లేకపోయేసరికి జగన్నాథం వాళ్ళవిషయంలో పూర్తిగా నిరాశ చేసుకున్నాడు. అల్లుళ్ళ నిరంకుశత్వాన్ని తలచుకుని పెళ్ళిలో శారదా హేమలను చూడటానికి నోచుకోలేదే అని కంట తడిపెట్టుకున్నాడు.

ఈ పరిస్థితిలో, పెళ్ళి యింకో పూట వుందనగా యిటు కామేశం, అటు నరసింహం సకుటుంబంగా విచ్చేశారు. జగన్నాథం మొదట తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. సంభ్రమాశ్చర్యాలతో జగన్నాథానికొక క్షణం నోటమాట పెగల్లేదు. జగన్నాథం ఆప్యాయంగా దగ్గరకెళ్ళి పలకరించబోయేసరికి కామేశం నరసింహం ముఖాలు చాటుచేసుకుని వీధిలోకి వెళ్ళిపోయారు.

ముందు నరసింహమే పలకరించాడు. కామేశాన్ని: "ఏమండోయ్. మీ వాటా మీకు ముట్టిందనుకుంటా" అన్నాడు నరసింహం ఎంతో కసిగా.

"మీకు?" ప్రశ్నకు ప్రశ్న సమాధానంగా వచ్చింది కామేశం దగ్గరనుంచి.

"అహ-అది కాదులెండి. డబ్బు చేతిలో పడితేనే కాని మళ్ళీ యీ గుమ్మం తొక్కనన్నారుకదూ — అందుకని." తన వాటా ఎగనామం పెట్టి మామగారు కామేశానికెక్కడ చెల్లించేశాడోనని నరసింహంగుర్ధ.

"మీరు మాత్రం తక్కువ తిన్నారా ఏమిటి? మీరూ అలానే అన్నారుగా?"

"ఊ-మరేం చేయమంటారు? మీ వంతు చేతిలోపడింది కాబట్టి మీరొచ్చారు. డబ్బు ఎగనామం పెట్టినా నేనువచ్చాను అదేదో ముఖాముఖి పరిష్కారం చేసుకుపోదామని."

"రైటు పదండి. నేనూ వస్తాను. నేనూ ఇదేదో తేల్చుకుందామనే వస్త" అన్నాడు కామేశం.

"ఆ...ఏమిటి?..." నరసింహం మొహం మీద ఆనందరేఖలు వెల్లివిరిసాయి ఇద్దరూ

~~~~~~~~....~~~~~~~~

**మందరపు పద్మ, లలిత**

~~~~~~~~....~~~~~~~~

సంతోషంగా ఒకరిభుజంమీదొకరు చేతులు వేసుకున్నారు.

అసలువిషయం ఏమిటంటే......

జగన్నాథానికి నలుగురూ కూతుళ్ళు. అందులో శారద మొదటిది. శారదకు సంబంధాలు వెతికి తీసుకురావటంతో అతని అస్తికలన్నీ అరిగిపోయాయి. ఆడపిల్లలు తల్లిదండ్రులకు శాపంలాంటి వాళ్ళని అతనికి శారద పెళ్ళిప్రయత్నాలు చేసేంతవరకూ తెలీదు. జగన్నాథం స్థితిపరుడు కాకపోవటాన్ని కట్నం యివ్వటానికెంతో కటకటలాడిపోయాడు. పేదవాడైతే మాత్రం కనికరించే దెవరు? కట్నం కక్కితేనే కాని కన్య మెళ్ళో పుస్తె పడదు! వరుడి తరఫు వాళ్ళడిగే కట్నం, కానుకలు యివ్వలేక జగన్నాథం అనేక సంబంధాలు జారవిడుచుకోవాల్సివచ్చింది. చివరకు స్కూలు ఫైనల్ చదివి ఏదో గుమాస్తాగిరి వెలిగిస్తున్న కామేశంతో బేరసారాలు సాగాయి. సంబంధం స్థిరపడింది. పెళ్లి జరిగిపోయింది.

తర్వాత కొద్దిరోజులకే హేమకు తలవని తలంపుగా సంబంధం కుదిరింది. హేమ మొగుడు నరసింహంకూడా స్కూలు ఫైనల్ వరకే చదువుకున్నాడు. పెళ్లినాటికింకా ఏ ఉద్యోగంలోనూ చేరబడలేదు. జగన్నాథం మొదటి అల్లుడు కామేశానికి ఏమాత్రం కట్నం, కానుక లిచ్చాడో నరసింహానికీ అంతే యిచ్చి పెళ్లి జరిపించాడు. ఆ మాటకొస్తే హేమ పెళ్లి శారద పెళ్ళికి డిటో.

అంతవరకూ బాగానే వుంది. కాని... వచ్చిన తగువంతా శ్యామల పెళ్లితోనే. ఒకదానివెంట ఒకటి గబగబా రెండు పెళ్లిళ్లు చేసేసరికి జగన్నాథం పరిస్థితి మరీ అధ్వాన్నమైపోయింది. హేమ పెళ్లి జరిగిన ఐదేళ్ళవరకూ శ్యామల పెళ్లి తలపెట్టలేదు. శ్యామలకు వరుణ్ణి వెదికి తీసుకురావటంలో జగన్నాథం యిదివరకంటె ఎక్కువ హైరానాపడ్డాడు.

తనదగ్గర డబ్బేమీ పెరగలేదు కాని కట్నం రేట్లు బాగా పెరిగిపోయాయి. ఈ సంగతి గ్రహించిన జగన్నాథం యిదివరకటి పెళ్ళిళ్ళ కయినంత మొత్తంలో శ్యామల పెండ్లి ఎలాగో కానిచ్చెయ్యగల ననుకున్నాడు. ఇదివరకిచ్చినట్టుగానే కట్నం, కానుకలు యివ్వటానికి సంకల్పించుకుని సంప్రదింపులు సాగించేసరికి రోజులు చాలా మారాయని బోధపడింది జగన్నాథానికి. దాంతో జగన్నాథం చాలా తికమకపడ్డాడు.

చివరకు వెయ్యిన్నూట పదహార్లు కట్నం, దానికి తగినట్టుగా లాంఛనాలు—ఇన్నీ కక్కితేనేకాని శ్యామలకు పెళ్ళి కాలేదు. కట్నం విషయంలో ఎంత కటకటలాడినా, చేసేదేమీ లేక తల తాకట్టు పెట్టి, అడిగినంతా ఇచ్చుకుని బి. ఏ. చదివిన సుందర్ చేత శ్యామల మెళ్ళో పుస్తె కట్టించాడు.

వచ్చిన తగువంతా అక్కడే.

జగన్నాథం వరుడిచేతిలో వెయ్యిన్నూట పదహార్లు పోసేసరికి కామేశానికి, నరసింహానికి తల గిర్రున తిరిగినట్టయింది.

"ఏమండోయ్ అన్నగారూ! చూశారా ఈ అన్యాయం! మనిద్దరికీ చెరొక ఐదొందలతో సరిపెట్టేసి, ఇతనికి వెయ్యిన్నూట పదహార్లు ధారపోస్తున్నాడు. ఎక్కడయినా యింత అన్యాయమా?" అన్నాడు నరసింహం ఎంతో కసిగా.

కామేశాని కసలే వళ్ళు మండుతోంది.

"ఊఁ. చూస్తూనే ఉన్నా" అన్నాడు మనసులో ఏదో పథకం వేస్తూ.

# ★ కట్నం తెచ్చిన పేచీ ★

ఎంత పరాభవమో చూడండి. నాకు నిజంగానే తలకొట్టేసినట్లుంది. అక్కడకు మనం ఎందుకూ పనిరానివాళ్ళమయినట్టూ, ఇతగాడేదో ప్రయోజకుడయినట్టూ. అందరిలోనూ మనకెంత చిన్నతనం. మనల్నిలా చిన్నచూపు......

కామేశం అవన్నీ వినిపించుకోలేదు.

"ఇంత అన్యాయం జరుగుతూ వుంటే మనం చూస్తూ వూరుకో కూడదు. సరిగ్గా ఇలానే జరిగింది మాస్నేహితుడు రామారావు విషయంలో. రామారావుకి అతని మామగారు తక్కిన వాళ్ళకిచ్చినట్టుగానే కట్నం అదీ యిచ్చి పెళ్ళిచేశాడు. కాని నాలుగో కూతురు పెళ్లిలో పెళ్ళికొడుక్కి ఎక్కువ కట్నం యిచ్చేడు. దాంతో అల్లుళ్లందరూ చిన్నబుచ్చుకుని కూర్చున్నారు. అయితే రామారావు మామగారు చాలా మంచివాడు లెండి. వెంటనే అతను వాళ్లి దగ్గరికెళ్ళి నవ్వుతూ "చూడండి బాబూ! మీకప్పుడే కోపంవచ్చినట్టుంది. నేనేమంత అన్యాయపరుడిని కాను. నాకు ఈ అల్లుడొకటి, మీరొకటి కాదు. ఇదిగో మీమీవంతులు మీరు తీసుకోండి" అని నాలుగో అల్లుడితో సమానంగా మిగతా కట్నం డబ్బులు వాళ్ళందరికీ యిచ్చేశాడట. మన మామగారికా వుద్దేశ్యం ససేమిరా లేదు లెండి, మనంతట మనమైనా అడిగి రాబట్టుకోకపోతే మన నెత్తిమీద చేసులే" అన్నాడు కామేశం, నరసింహం చేయి గట్టిగా నొక్కుతూ.

ఆ సాయంకాలం జగన్నాథం గదిలో ఒంటరిగా కూర్చుని ఏదో వ్రాసుకుంటున్న సమయంలో కామేశం, నరసింహం లిద్దరూ వచ్చి మెదలకుండా నిలుచున్నారు. వాళ్ల ముఖాల మీది క్రోధ చిహ్నాలు చూసి జగన్నాథం కంగారు పడ్డాడు. ఇంతలో కామేశం అసలు సంగతి బైట పెట్టాడు.

"మామాగారూ...అందరం అల్లుళ్ళమే కదా. ఒకళ్ళ కెక్కువ కట్నం, ఒకళ్ళకు తక్కువా ఏమిటి? మాకు రావాల్సిన మిగతా కట్నం మాటేమిటి మరి?" అంటూ మామగారి కేసి చురచుర చూశాడు కామేశం.

జగన్నాథం నిర్ఘాంత పోయాడు.

"ఎక్కడినించి డబ్బు తేను నాయనా? నేనేమైనా వున్న వాడినా ఏమైనానా? మీ రడిగినంత కట్నం మీ కిచ్చాను. ఇతనడిగినంతా యితని కిచ్చాను. కాకపోతే నా దురదృష్టం కొద్దీ అప్పటికీ యిప్పటికీ రోజులు చాలా మారాయి" అన్నాడు జగన్నాథం నిట్టూరుస్తూ.

"రోజులు మారితే మటుకు డబ్బుకు ఇప్పుడైనా, అప్పుడైనా ఒకటే విలువ. కాకపోతే 500 రూ., 1116 ఎప్పుడైనా సమాన మౌతాయా?" అంటూ చిటపటలాడాడు నరసింహం.

"ఆ, ఆ! అంతకోపం ఎందుకు? నేను మాత్రం..." జగన్నాథం బిత్తరి చూపులు చూసి యిద్దరికీ జాలి వేసింది. అంతకాకపోయినా సగం యిచ్చినా సరే, సరిపెట్టుకుందా మనుకున్నారు ఎవరి మనస్సుల్లో వారు.

అప్పటికే ఘర్షణ అందరి చెవుల్లోపడింది. పెళ్ళికొడుకు సుందర్, మరికొంతమంది పెద్ద మనుష్యులు వచ్చి అసలు విషయం తెలుసుకున్నారు.

సుందర్ బి. ఏ. కామేశంకేసి, నరసింహం కేసి చూసి గర్వంగా నవ్వాడు.

"అన్యాయం! అన్యాయం! యెవరి అర్హతనుబట్టి వాళ్లకు కట్నాలు. బి. ఏ. చదివినవాడికీ, స్కూలుఫైనలు వాడికి ఒకటే కట్నమా? అవ్వ...పుచ్చు వంకాయలు, మంచివంకాయలు వొకే ధరకు వస్తాయామరి? అవీ వంకాయలే, యివీ వంకాయలే నని, పుచ్చు వంకాయలను ఎక్కువధర పెట్టి యెవరైనా కొంటారా?" అంటూ వ్యాఖ్యానించాడు సుందర్.

కామేశానికీ, నరసింహానికీ ఒళ్ళుతెలియనంత కోపంవచ్చింది. అక్కడికి యితనే తమకంటె మహా వూడబొడిచినట్టు. అతనేమో మంచి వంకాయట. తామేమో పుచ్చువంకాయలట.

పైకిమాత్రం కామేశం "చూడండి మీరు అనవసరంగా మా విషయంలో జోక్యం కలుగజేసుకోకండి. మీరు బి. ఏ. చదివినందుకు మీకేదో ఎక్కువకట్నం యివ్వాలని రాసిపెట్టినట్లు మాట్లాడకండి. మీ బి. ఏ. మాస్కూలుఫైనల్‌తో సమానమేలెండి. రానురాను స్టాండర్డ్ తగ్గిపోతూవుంటేనే" అంటూ సుందర్ వైపు వేడి చూపులు చూశాడు.

"వెధవడిగ్రీ. డిగ్రీదేముంది? ఓ నాలుగేళ్లు కష్టపడితే బి. ఏ.! మీ కావుద్దేశమే వుంటే చెప్పండి. ఓ నాలుగేళ్లు మీ అమ్మాయిని మీ దగ్గిరే అట్టే పెట్టుకుంటే, నేనిప్పుడేవెళ్లి కాలేజిలో చేరిపోతాను. పోనీ, ఆ డిగ్రీ ఏదో వచ్చాకే డబ్బు యిద్దురుకాని లెండి" అన్నాడు నరసింహం.

"భేష్! బాగా చెప్పావయ్యా! నేను అలానే చేస్తాను!" నవ్వాడు కామేశం.

శారద కిద్దరు పిల్లలు. హేమ కొక పిల్ల. నాలుగేళ్లు యింతమందినీ పోషించి, ఆ తర్వాత డబ్బు యిచ్చుకోవాలి. ఓయ్! బాబోయ్! అనుకుని జగన్నాథం నిలువునా నీరైపోయాడు.

"ఇంతకీ డబ్బు యిస్తారా యిలా యివ్వండి లేదా యింక మీకూ మాకూ తెగతెంపులే – అంటూ విసురుగా జగన్నాథం వైపు నడిచాడు కామేశం. కామేశం కోపం చూసి జగన్నాథం హడలిపోయాడు.

"బీదవాడిని నామీద..."

"కనికారం వుంచబట్టే. కాకపోతే మిగతా లాంఛనాలన్నీ ఇలా చేశారని అలా చేశారని మేమైనా పేచీ పెట్టామా?" అంటూ దాక్షిణ్యంకనపర్చాడు నరసింహం.

"అది సరే కాని, ఆఖరుసారి అడుగుతున్నాను. ఇస్తారా, ఇవ్వరా?" అన్నాడు కామేశం జగన్నాథం కేసిచూసి.

కామేశం అసలే పట్టుదల మనిషి. ఈ వుద్రేకం చూసి అందరూ హడలుకున్నారు.

వ్యవహారం బాగా ముదురుతోందని గ్రహించిన ఓ పెద్దమనిషి "అదేమిటయ్యా! అలా కోపగించుకుంటారు! అతను మాత్రం యివ్వనన్నాడా? చూడు జగన్నాథం వాళ్లనేదో కాస్త శాంతపరచు" అన్నాడు.

"ఎలా? నా పరిస్థితి మీకు తెలియంది కాదుగా?" అన్నాడు నిస్పృహగా జగన్నాథం.

"వాళ్లకు మాత్రం నీ పరిస్థితి తెలియకనుకున్నావా? వాళ్ళు బుద్ధిమంతులే. నువ్వెంత ఇస్తే, అంతకే సంతోషిస్తారు. ఇద్దరికీ చెరొక వంద రూపాయలు చేతిలో పెట్టావా..."

"చాలెండి....కానీ తగ్గినా వూరుకునేది లేదు. ఇందాకైతే పోనీ అని జాలి తలచి యిచ్చినంతకే తృప్తిపడే వాడిని. పుచ్చు వంకాయలు, చచ్చు వంకాయలు అని యిన్ని మాటలు తిన్నాక, యింకానా? ఆ పుచ్చు వంకాల తడాఖా ఏదో చూపిస్తా మరి" అంటూ చురచుర చూశాడు కామేశం సుందర్ వైపు.

"జగన్నాథం బాబూ! అంతా ఒక్కసారి ఎలాగూ యిచ్చుకోలేవు. కాబట్టి కొద్ది కొద్దిగా తీర్చుకో. మామగారిమీద కనికరించి కొన్నాళ్లు ఓపిక పట్టండి నాయనా" అని సర్దేశాడో పెద్ద మనిషి.

జగన్నాథం "సరే" నని తలూపాడు. జగన్నాథం మాటలమీద నమ్మకం లేని కామేశానికీ, నరసింహానికీ ఈ తీర్పు రుచించలేదు.

సరే. ఈ సంగతి మాత్రం జ్ఞాపకం పెట్టుకోండి. డబ్బు ఎప్పుడైతే యిస్తారో అప్పుడే మీ గుమ్మం తొక్కటం" అన్నాడు కామేశం.

"నేను మాత్రం తక్కువ తిన్నానా? నేనీ ధాయలకేరాను" అంటూ నరసింహం బయటకు కదిలాడు. కామేశం అనుసరించాడు.

కామేశం శారదను తీసుకుని వూరికెళ్ళిపోయాడు. నరసింహం హేమతో తన వూరు చేరుకున్నాడు. ఆనాటినుండి యీనాటివరకూ రాకపోకలు బందు. ఈ రెండేళ్లలో రావాల్సిన మొత్తంలో కానీయైనా తీరలేదు. ఇది చూస్తూనే వాళ్ళకు మరీ మంటగా వుంది.

* * *

"అరె! మీరా ఎప్పుడొచ్చారేమిటి...?" ఎటునుంచో వచ్చి సుందర్ బి. ఏ. నవ్వుతూ పలకరించాడు. కామేశానికీ, నరసింహానికి అతన్ని చూస్తేనే వళ్లుమంట. తనేకదా బి. ఏ. అని ఏం గొప్ప, ఏం గర్వం? నరసింహం ముఖం చిట్లించుకున్నాడు. కామేశం చురచుర చూడబోయి ఆగాడు.

పెళ్ళికొడుకు ఎమ్. ఏ. అట. ఆ సంగతి శుభలేఖలోనే వుంది. బి. ఎ. గాడే 1116 పుచ్చుకున్నప్పుడు ఎమ్. ఏ గాడు కనీసం రెండు వేలైనా పుచ్చుకోడూ?

"ఆ ఇప్పుడే లెండి. పెళ్లి కొడుకును చూశారా? ఎలావుంటాడు? కట్నం ఎంత? స్థారు ఏమిటీ కథ?" అంటూ మామూలు ధోరణిలో మాట్లాడాడు కామేశం.

సుందర్ తల తడుముకున్నాడు. కట్నం సంగతి అదీ నాకసలే తెలీదండి. ఏదో మాటల సందర్భంలో మామగారి నడిగితే 'నేనేం కట్నాలిస్తాను?' అంటూ అసలు విషయం చెప్పకుండా తప్పించుకున్నారు. ఇంతకీ అతనికి నేనంటే కోపం లెండి. ఆరోజు నేను పానకంలో పుడకలా వచ్చి వ్యవహారం చెడగొట్టానట. లేకపోతే మీరు కొంత తక్కువకైనా వప్పుకునే వారట. ఎవరో చెప్పిన మాటలే లెండి..."

"అలాగే. మరింక వస్తాం" అంటూ కామేశం, నరసింహం అక్కడ నుండి కదిలేరు.

* * *

జగన్నాధం ఎదో హడావుడిగా తిరుగుతున్నాడు. కామేశం, నరసింహం చరచరా రావటంతో జగన్నాధం ముఖం ఉరి శిక్షపడ్డ నేరస్థుడి ముఖం మాదిరిగా మారిపోయింది. కామేశం గబగబా అడగాల్సినవన్నీ అడిగేశాడు.

"ఇన్నాళ్ళోపికపట్టినా మీదగ్గరనుంచి చిల్లిగవ్వైనా వూడిపడలేదు. మా డబ్బేదో మాకు న్యాయంగా యిస్తారా సరేసరి. లేదా నేను మీకింక అల్లుడినీ కాను మీరు నాకు మామగారూ కారు" అంటూ ఉవ్వెత్తున లేచాడు కామేశం.

జగన్నాధం కళ్ళలో నీళ్లు మెదిలాయి. తను పేదవాడు - అంత డబ్బు కొకపోతే అందులో ఆవగింజంతైనా, చెల్లించలేకపోయాడు. తన స్థితిగతులు తెలిసి కూడా తన్నిలా హింసించడం ఎందుకు?

కామేశం కేకలకు అందరూ పరిగెత్తుకు వచ్చారు. సుందర్ అందరికీ అర్థమయ్యేలాగు అసలు సంగతి విప్పి చెప్పాడు.

"కట్నం యిచ్చేటప్పుడు అందరికీ సమానంగా యివ్వాలా, వద్దా చెప్పండి? మామగారు వీళ్లకేమో తక్కువిచ్చారు. మరి ఆ డబ్బు ఎన్నాళ్ళకి చెల్లించకపోతే వాళ్ళు మాత్రం ఎన్నాళ్లూరుకుంటారు?"

కామేశం, నరసింహం ఆశ్చర్యంగా సుందర్ వైపు చూశారు. ఎవరి అర్హతనుబట్టి వాళ్లకు కట్నమని ఏదేదో పేలాడే ఆ సుందరేనా వీడు? మొత్తానికి సుందర్ తమ పక్షంలోనే కలిశాడు.

"చూడండి. ఇప్పుడీ మోహన్ గారికి మాకంటె ఎక్కువిస్తే, మాక్కూడా అతనితో సమానంగా ఆ పంతు డబ్బు న్యాయంగా యివ్వాలంటారా, లేదంటారా?" అంటూ సుందర్ పెద్దమనుష్యుల నందరినీ ఉద్దేశించి మాట్లాడాడు.

"ఓహో అదా సంగతి" అనుకున్నారు కామేశం, నరసింహం. ఏమయితేనేం? ఇద్దరికి ముగ్గురయ్యారు. ఇదివరకు రావల్సిన 516 ఇప్పుడీ ఎమ్. ఏ. గాడికిచ్చే కట్నంతో సమానంగా యింకా కొంత—మొత్తానికి చాలా పెద్ద మొత్తమే అవుతుందని తలచుకుని కామేశం, నరసింహం సంతోషించారు. సుందర్ తనకేమాత్రం వస్తుందా అని అంచనాలు వేసుకుంటున్నాడు.

పెళ్ళికొడుకు మోహన్ మూర్తీభవించిన శోకంలోవున్న జగన్నాధం వైపొకసారి ప్రతికక్షులు ముగ్గురి వైపొకసారి చూశాడు.

"మీరనేది అందరికీ కట్నం సమానంగా ఇవ్వాలనే కదూ? అవును. తప్పకుండా. ఇందులో అన్యాయమేమీ లేదు" అన్నాడు మోహన్ ఎం. ఏ. సీరియస్‌గా ఆలోచిస్తూ.

పెళ్ళికొడుకు కూడా తమ పక్షమే. ఇంకేం! రొట్టె విరిగి నేతిలో పడిందంటే పడిందనుకున్నారు ముగ్గురూ.

జగన్నాధం తెల్లబోయి బిత్తరి చూపులు చూశాడు మోహన్‌వైపు.

"అన్యాయమనేది మా జన్మలో ఎరగం. మా డబ్బు మాకిచ్చేస్తే మళ్ళీ నోరెత్తితే మేమో చూడండి" అన్నాడు కామేశం మోహన్ మాటలతో మరింత ధైర్యంవచ్చి.

"ఇచ్చేకట్నమేదో మన నలుగురికీ సమానంగా యివ్వాలిగాని, యిందులో ఒకళ్ళకెక్కువ, ఒకళ్ళకు తక్కువా యేమిటి? ఇలాంటివి చూస్తే నాకు మహా అసహ్యం. ఈతరహ వేదో తీరిస్తేనేకాని నాకునిద్రపట్టదు" అన్నాడు మోహన్ ముఖం చిట్లించుకుని.

ముగ్గురూ హర్షధ్వానాలు చేశారు. ఎంత పేచీ తెచ్చిందీ దిక్కుమాలినకట్నం అనుకుని పెద్దమనుష్యులంతా నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

"మరి నేను చెప్పినట్లుచేయడానికి మీకేమైనా అభ్యంతర ఉందా?" అనడిగాడు మోహన్ ముగ్గురినీ చూసి.

"అబ్బే-లేదు, లేదు" అంటూ ముగ్గురూ ఒకేసారి ఆమోదం తెలిపారు.

"అయితే ముందు మీరిదివరలో పుచ్చుకున్న కట్నం యావత్తు డబ్బూ మామగారికి తెచ్చియిచ్చెయ్యండి" అన్నాడు మోహన్ గంభీరంగా.

"ఆ...అదేమిటి..." అంటూ తెల్లబోయి చూశారు ముగ్గురూ.

"మరే...మామగారు నాకు కానీకూడా కట్నం యివ్వటం లేదు. మరికట్నం అందరికీ సమానంగా వుండాలని మీరు మరీ మరీ ఘోష పెతున్నారా?"

ముగ్గురూ నిలువునా నీరై జగన్నాధం వైపు చూశారు. జగన్నాధం హీనస్వరం సవరించుకున్నాడు. "నిజమే నాయనా! నా దగ్గర డబ్బేముందని? అసలు ప్రమీల పెళ్ళి ఎప్పటికయినా చేస్తానా అనుకున్నాను. దేవుడికి నా మీదింకా దయపోలేదు. ఈ మోహన్‌బాబుని చూపించాడు. మోహన్‌బాబు కట్నం లేకుండా పెళ్ళిచేసుకోవటానికి అంగీకరించకపోతే ప్రమీలకసలు పెళ్లంటూ అయ్యేదికాదేమో! అన్నాడు గద్గదికతో.

ఈ తీర్పుతో ముగ్గురూ ఉక్కిరి బిక్కిరి అయ్యారు. అనుకూలంగా నడుస్తోందన్న కేసు క్షణంలో ప్రతికూలమై పోయింది. ఎవరికీ ఏమాట అంటానికీ తోచటం లేదు. గదంతా భరించరానంత నిశ్శబ్దమైపోయింది. చివరికి ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ ఒక పెద్దమనిషి.

"ఏదో మోహన్‌గారు మాటవరస కన్నారుకాని, జగన్నాధం యిచ్చిన డబ్బు పుచ్చుకుంటాడేమిటి? ఎవరూ ఎవరికీ ఏం ఇచ్చుకోనక్కర్లేదు. ఇంక పదండి ముహూర్తం దగ్గరపడ్డది" అంటూ పెళ్లిపందిట్లోకి దారితీశాడు.

కామేశం, నరసింహం, సుందర్ "మీకింకా కదలాలని లేదా?" అంటూ నవ్వుతూ మోహన్‌కు చరచరా లాక్కుపోయారు పందిట్లోకి.

జగన్నాధం ఆనందాశ్రువులు తుడుచుకుంటూ అందరి వెనకాల వెళ్లాడు.



# చూపులు ★ కొండపల్లి సాంబమూర్తి

నర్సింగరావు గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. ఎంతకూ భార్య రాకపోవడంతో విసుగెత్తి, గది కానుకొని ఉన్న వరండాలోనికి వెళ్ళి, కిటికీలోంచి చూస్తూ నిల్చున్నాడు. ఏమీ తోచనప్పుడు ప్రకృతిని చూస్తూ ఆనందించడం అతనికో సరదా.

కొంతసేపటికి పార్వతి గదిలోనికి వచ్చి, నూనెతీసి తలకు రాసి దువ్వెనతో శుభ్రముగా తల దువ్వుకుంది. నిల్చుని జడ అల్లుకోవడం మొదలు పెట్టింది. నిశ్శబ్దంగా ఉన్న ఆ గదిలో అలారం టైంపీసు చేస్తున్న 'టిక్కు టక్కు'లు తప్పించి ఇంకే శబ్దం లేకపోవడం ఆమెకు చిరాకు కలిగించిందేమో, మెల్లగా పాడడం మొదలు పెట్టింది. సినిమా పాటల్లో తన స్వంతమాటలు చేర్చి ఎవ్వరూ లేనప్పుడు పాడుకోవడం ఆమెకో అలవాటు.

"అందాల నారాజ రావోయి
మల్లెపూవులు వెంట తేవోయి"

పాటవిని నర్సింగరావు మెల్లగా లోనికి ప్రవేశించి ఆమె వెనుకనున్న కుర్చీలో చప్పుడు చేయకుండా కూర్చున్నాడు.

అతనికి నవ్వువచ్చింది. కాని నవ్వుని బలవంతంపై ఆపుకుంటూ చప్పుడు చేయకుండా కూర్చున్నాడు.

"అందాల నా రాజ రావోయి
మల్లెపూవులు వెంట తేవో......"

అంటూ నవ్వలేక సతమతమౌతున్న భర్తను చూసి, ఠక్కున పాటనాపి నిర్ఘాంతపోయింది. నర్సింగరావు పక్కున నవ్వేశాడు. పార్వతి సిగ్గుపడింది.

"ఎవరో...ఆ అందాలరాజు?"

"మల్లెపువ్వులు తెచ్చారా?" మెల్లగా ప్రశ్నించింది.

"నేనే నన్నమాట...ఆ అందాలరాజుని? ...పువ్వులు తెచ్చి అరగంట కావస్తోంది. కిటికీమీదున్నాయ్, అలంకరించు."

పార్వతి కిటికీవద్దకు వెళ్ళి మల్లెపూవులు పొట్లం విప్పి దండ గ్రుచ్చటానికి ఉపక్రమించింది.

"ఇంకా అలా కూర్చున్నారేం...లేచి బట్టలు వేసుకోండి."

''ఎందుకో...ఈ సింగారాలు?'' ఇంటివాసాలవైపు చూస్తూ అన్నాడతను.

''సినిమా చాల బాగుందట.''

"వాటికేం...బోలెడంతడబ్బుపోసి తీస్తున్నారు. బాగులేవంటే, నీలాంటి సినిమా అభిమానులు ఊరుకుంటారా?''

''వాళ్ళంత డబ్బుపోసి తీస్తున్నారు కాబట్టే మనం వెళ్ళి చూడటం'' ఎగతాళిగా అంది పార్వతి.

"తీసేవాళ్ళకు లేకపోతే చూసేవాళ్ళకయినా ఉండాలి. నీలాంటి వాళ్ళు డబ్బులివ్వబట్టే వాళ్ళు ఇంతకన్నా బాగా డబ్బు రావాలని ఉత్తమ చెత్తచిత్రాల్ని నిర్మిస్తున్నారు. చెత్తచిత్రాల కన్నిటికీ డబ్బు పోయటానికి నేనేం డబ్బు ప్రోగుపెట్టుకుని కూర్చున్నాననుకున్నావా?" కోపంగా అన్నాడతను.

"అయితే ఈ పువ్వులెందుకు తెచ్చారు? డబ్బులు మిగులుతాయి, వాడికిచ్చేయండి" అంటూ చిరాకుగా అతని వడిలో పడేసింది.

"కాలవలో పారేయ్"అంటూ కోపంగా పువ్వుల్ని విసిరేశాడతను.

పువ్వులన్నీ నేలపై నక్షత్రాల్లా పడి వారి కోపం చూసి పకపక నవ్వేయి. కొంతసేపు మౌనంగా గడిచింది.

"పార్వతీ...పార్వతీ" అంటూ గదిలో ప్రవేశించింది గజలక్ష్మి.

గజలక్ష్మిని చూడటంతో అతనుకోపాన్ని కప్పిపుచ్చుకొని చిరునవ్వు నవ్వేడు. పార్వతి ముఖం మాడ్చుకొని కూర్చుంది. పువ్వుల్ని చూసి గజలక్ష్మి సంగతి చాలవరకు అర్థం చేసుకుంది.

"ఏం...గజా, చిలకాకుపచ్చ చీరె కట్టి, చిలకలా తయారయేవే...ఏమిటి విశేషం?" నవ్వుతూ ప్రశ్నించాడు.

"పువ్వులన్నీ ఇలా పారేశారేం?" అంటూ గజ పువ్వులు తీయటానికి కూర్చుంది.

నర్సింగరావు అభిమానం దెబ్బతింది. తన ఇంట్లో తనభార్య చేయవలసిన పని, ఇతర స్త్రీ చెయ్యాలేమా!

"అలా ఉండనీ గజా, నేనెత్తుతాలే" అంటూ పువ్వులేరి ఆకుతో టేబిలుపై పెట్టేడు.

"పార్వతీ....ఇంకా బట్టలు మార్చుకోలేదేం? లే...లే..." అంది గజ.

"ఆయన సినీమాకు రారట" మెల్లగా చెప్పింది పార్వతి.

"రాకపోవడమేం?...అలా అంటారుకాని తప్పకుండా వస్తారు. నువ్వు లేచి చీర మార్చుకో."

"నేనిప్పుడు రాలేను గజా" మెల్లగా అన్నాడతను.

"మా అక్క కోపం పోవాలంటే మీరిప్పుడు రావాలి. లేకపోతే నామీద ఒట్టు" చిలిపిగా అంది గజ.

నర్సింగరావు మాటాడకుండా ఊరుకున్నాడు.

"అలా చూస్తుండండి.....మా అక్కనిప్పుడు చిలకలా తయారుచేసి తీసుకువస్తాను" అంటూ పువ్వులు పట్టుకొని పార్వతితో ప్రక్క గదిలోనికి వెళ్ళిపోయింది.

ఎలాగైతే నేం గజ బలవంతంపై సినీమాకు వాళ్ళతో బయలుదేరి వెళ్ళేడు నర్సింగరావు. తనమాటను త్రోసిపుచ్చి, గజ మాటపై తన భర్త రావడం పార్వతి హృదయంలో ఆరని జ్వాలలా మండుతోంది.

నర్సింగరావు చెప్పినట్లుగానే చిత్రం కూడా ఉంది. చిత్రాలలో ఉత్తమ చిత్రాలకు బహుమతులిస్తున్నారు. అలాగే ఉత్తమ చెత్త చిత్రాలకుకూడా బహుమతులిస్తే బాగుంటుం దనిపించింది.

చెత్త చిత్రం తీయడమంటే మాటలా? అసహజ ఘట్టాల్ని ప్రవేశపెట్టాలి. నటులు మామూలుగా నటించక కృత్రిమంగా నటించాలి. అలా వారిచే నటింప జేయటానికి దర్శకుడు తన బుర్రను పాడు చేసుకోవాలి. పాటలు వినసొంపుగా ఉండకూడదు. మ్యూజిక్ కర్ణకఠోరంగా ఉండాలి.

## కళా కౌశలం

రెండో ఆట సినిమాచూసి, ఒక పెద్దమనిషి ఈల పాట వేస్తూ ఇంటికి వెళ్తున్నాడు.

పెద్దవీధి మళుపు తిరగ్గానే మరో చిన్న సందులోంచి ఇంకో పెద్దమనిషివచ్చి, పలకరించాడు.

"టైమెంతండి?"

"పన్నెండున్నర"

"అవునుగాని ఇటు ఓ పోలీసాయన వచ్చాడు మీ క్కనబడ్డాడా? మా తమ్ముడేలెండి."

"అబ్బే లేదండి?"

"రైటో, మీ చేతివాచీ మనీపర్సు ఇలా ఇచ్చి, బుద్ధిగా ఇంటికెళ్ళిపోండి. నా దగ్గిర చాకు మొండిదైనా, మొన బాగానే ఉంది."

ప్రఖ్యాత ఆర్టిస్టులు తమ ఆర్టు నేమాత్రం ఉపయోగించ కూడదు. ఎంత కష్టం...ఎంత కష్టం. నిజంగా ఇటువంటి చిత్రాలకే బహుమతు లివ్వాలను కున్నాడు నర్సింగరావు.

సినిమాచూసి ఇంటికి వచ్చిన తరువాత కూడ చాలాసేపు ఎడమొహం పెడమొహంగానే ఉన్నారు దంపతు లిద్దరున్నూ. సంసారంలో చిన్న విషయాల మీదే సతీపతులకు ఎక్కువ పటింపు లొస్తాయి. కాని ఆ పట్టుదల లెంత సేపు?

భళ్లున తెల్లవారింది. పక్షుల కలకలా రావంతో పాటు శ్రుతి కలుపుతున్నాయి, నూతుల దగ్గర బిందెలు.

నర్సింగరావు ప్రక్కమీదనుండి లేచేడు. పార్వతి కనుపించలేదు. సిగరెట్టు ముట్టించి వరండాలోనికి వచ్చి కిటికీవద్ద నిల్చుని ప్రకృతి అందాన్ని చూస్తూ ఆనందిస్తున్నాడు.

పార్వతి గదిలోనికి వచ్చి చూసింది. భర్త ప్రక్కపై లేక పోవటంచే వరండాలోకి వచ్చి అతని వెనుక ప్రక్కగా నిల్చుంది. నూతివద్ద గజ నీళ్లు తోడుతోంది. నీళ్లుతోడుతూ ఎందుకో నవ్వుతోంది, గజ. పార్వతి హృదయంలో అగ్నికి వాయువు తోడైనట్లయింది.

"అంత దీక్షగా చూస్తున్నా రేమిటి?"

"చూడు పార్వతీ...ఆ జామిచెట్టుపైనున్న ఆ చిలక ఎంతఅందంగా పండు తింటూందో?" చెప్తూ ఆనందిస్తున్నాడు నర్సింగరావు.

"పండు తినటం కాదు, మీ చిలక నీళ్లు తోడుతోంది. ఏం, అంతఅందంగా నీళ్లు తోడుతోందా?" పార్వతి వెగటు మాటలు విని ఆశ్చర్యపోతూ నూతివైపు చూసేడు. గజ బిందె కెత్తుకొని వెళ్లిపోతూంది. చెట్టుపైనున్న చిలక కూడ ఎగిరిపోయింది. కోపంగా పార్వతివైపు చూసేడు.

"ఏం చిలక వెళ్లిపోయిందని కోపమా? అది వెళ్ళిపోతే నేనేం చేస్తాను?"

"మనిషన్నప్పుడు హద్దు పద్దూ ఉండాలి. నోటికెలావస్తే అలా కూతలు కూయడం మంచిదికాదు. నీ అనుమానం వల్లనే సంసారాన్ని కడకు నాశనం చేసుకుంటావ్... ఇదే నేను నీకు చెప్పదలచింది" అంటూ కోపంగా గదిలోనికి వచ్చాడు.

"అనుమానం కాదు, నిజం; నిజం నేను తెలుసుకున్నానని బాధపడుతున్నారు కాబోలు. ఇంతకాలం నా ఎదుటనే జరుగుతున్న మీఇద్దరి హాస్యాలు, చేష్టలు గ్రహించలేకపోయేను. అక్కా...అక్కా...అంటూ వచ్చి నా భర్తనే వలలో వేసుకుంది...ఎంత నటన...ఎంతద్రోహం."

"పార్వతీ..." కోపంగా అరిచాడతను.

"ఏం...మీ చిలక నన్నానని కోపమా?" మాట పూర్తి గాకుండానే ఆమె రెండు చెంపలు "పట్ పట్" మన్నాయి. చెక్కిళ్లు పట్టుకొని ఏడుస్తూ మంచంమీద పడిపోయింది పార్వతి.

మొహం కడుక్కొని, బట్టలు వేసుకొని రుసరుస లాడుతూ, కాఫీ త్రాగకుండా హాస్పిటల్‌కు వెళ్ళిపోయాడు. నర్సింగరావు ఒక ప్రైవేటు డాక్టరువద్ద కాంపౌండరుగా పని చేస్తున్నాడు.

డాక్టరుగారు వ్రాసి ఇస్తున్న చీటీలకు ఏవో మందులు కలిపి ఇచ్చేస్తున్నాడు. నర్సింగరావు ముఖం చూసి డాక్టరు గారు కూడా అనుమానపడి, అతను మందులు కలుపుతున్నప్పుడు ఓ కంట కనిపెడుతున్నారు. అలవాటైన చెయ్యేమో, చిరాకుగాఉన్నా మందులు సరిగానే కలిపి ఇస్తున్నాడు నర్సింగరావు. అది విషమో, అమృతమో, తెలియని రోగులు మందుని చూసి రోగం పోయినట్లు ఆనందిస్తూపోతున్నారు.

పన్నెండు గంటలైంది. డాక్టరు గారు ఇంటికి వెళ్లిపోయేరు. నర్సింగరావుకి బాగా ఆకలి వేసింది. ఇంటికి వెళ్లకుండా "నేషనల్ కేఫ్"కు వెళ్ళి భోజనం చేసి హాస్పిటల్‌కు వచ్చి కొంతసేపు నిద్రపోయేడు.

మధ్యాహ్నం భర్త భోజనానికి రాకపోవడంతో పార్వతికి గజపై పూర్తిగా కోపంవచ్చింది. ప్రక్కింటికివెళ్లి స్నేహితురాలైన సుగుణవద్ద తన అక్కసునంతా వెళ్లగక్కింది. గజ తన సంసారాన్ని నాశనం చేయటానికే పూనుకుందని ఏడ్చి ఇంటికి వచ్చేసింది.

సుగుణ, గజ, పార్వతి ముగ్గురూ అత్యంత స్నేహభావంతో ఉంటూ ఒకరి కష్టసుఖాలొకరు చెప్పుకొనేవారు. కాని ఈనాడు గజపై పార్వతికివచ్చిన ద్వేషంచూసి సుగుణ విచారించింది. గజవద్దకు వెళ్ళి సంగతంతా పూర్తిగా చెప్పేసింది సుగుణ.

నాటినుండి గజ పార్వతి ఇంటికి రావడం మానేసింది. ఆమె రాకపోవడం చూసి నర్సింగరావు చాల సార్లు "నీవే మైనా అన్నావా?" అని ప్రశ్నించేడు. "నాకేమీ తెలియద"ంటూ భర్త నోకంట కనిపెడుతుండేది పార్వతి. నెలరోజులు గడిచాయి.

ఆ వేళ ఉదయం నర్సింగరావు కాఫీ త్రాగి పార్వతితో కబుర్లు చెప్తున్నాడు. గజ నిశ్శబ్దంగా గదిలోనికి ప్రవేశించింది. ఆమెను చూసి పార్వతి లేచి ముందుకు వచ్చింది.

# ★ చూపులు ★

"మధ్యాహ్నం మాఇంట్లో సత్యనారాయణ వ్రతం చేస్తున్నారు. నిన్ను రమ్మని మా అమ్మ చెప్పమంది," మొగం దించుకొనే చెప్పింది గజ.

"గజా...ఓ సారి ఇలా వచ్చి కూర్చో" మని మంచం చూపించేడు నర్సింగరావు.

గజ మెల్లగా వచ్చి మంచంపై మొగం దించుకొని కూర్చుంది. పార్వతి కుర్చీలో కూలబడింది.

"ఏం గజా...మా యింటికి పూర్తిగా రావడం మానేశావ్?" మెల్లగా ప్రశ్నించేడు నర్సింగరావు.

అతనీ ప్రశ్న వేస్తాడని తెలిసుంటే గజ ఆ ఇంటిలోనే కాలు పెట్టి ఉండేది కాదు. బాధగా అతని కళ్ళలోనికోసారి చూసి మొగం దించుకుంది. ఆమె చూపులు చూసి నర్సింగరావు బాధపడ్డాడు.

"చెప్పమ్మా...మనసులో నున్న బాధ ఇతరులతో చెప్పితే మనస్సు కొంత శాంతిస్తుంది. లేకపోతే ఆ బాధ ఆమనిషినే కృంగదీస్తుంది...ఇదివరకు ఈ ఇంట్లో కళకళలాడుతూ తిరిగే నువ్వు, రావడం మానేయడం నాకెంతో కష్టంగా ఉంది. నాకు స్వంత చెల్లెలు లేకపోయినా, గజ అనే చెల్లెలుందని నిన్ను చూసి ఆనందించేవాడిని. కాని నువ్వుకూడా రావడం మానేశావ్. ఈ అన్నయ్య ఇంటిపై నీకింత ఆగ్రహం ఎందుకొచ్చిందమ్మా?" బాధగా అడిగేడతను.

పార్వతికి ఈ మాటలు ఆశ్చర్యం కలిగించాయి.

గజ పెదిములు మెల్లగా కదిలాయి.

"మనస్సు ఎట్లా చెబితే అట్లే చూస్తాయి కన్నులు. నన్ను దొంగలా చూస్తే దొంగలానే కన్పిస్తాను. ఒక మల్లెపూవు చెప్పకుండా తీసుకొని వెళ్ళిపోయే సనుకోండి. మీరు దొంగలా చూస్తే, "మల్లెపూవు కూడ దొంగిలించింది, దాని బుద్ధి ఎక్కడకు పోతుంది?" అంటారు. లేక సహృదయంతో చూస్తే "ఎంత చనువుగా మసలుతూందో?" అంటారు......"

"నిన్ను దొంగ అని పార్వతి అన్నదా?"

"పార్వతి నన్ను దొంగన్నా భరించేదాన్ని, కాని..." చెప్పలేక కళ్ళొత్తుకుంటూ ఆగిపోయింది గజ.

"చెప్పమ్మా ఏముంది?"

"అక్క నన్ను..." గజ ముఖం పాలిపోయింది. కంఠం రుద్ధమైంది.

"గుణ దగ్గర ఆ మాటనబట్టి సరిపోయింది. ఇంకొకరివద్ద అనివుంటే?...ముందు ముందు పెళ్ళి కావలసినదాన్ని..." తన కన్నీటి వతనికి చూపలేక ముఖం ప్రక్కకు త్రిప్పుకొంది.

"వస్తా నన్నయ్యా" అంటూ దుఃఖాన్నాపుకోలేక వడివడిగా లేచి వెళ్ళిపోయింది. "గజా" అంటూ ఆత్రుతగా పిలిచింది పార్వతి. కాని ఆ పిలుపు గజకు విన్పించలేదు. పార్వతి గబగబ వెళ్లి గజ చేయి పట్టుకొంది. గజ నిల్చుండి పోయింది.

"గజా...నిన్నపార్థం చేసుకొన్నాను. నన్ను క్షమించవూ?"అంటూ ఆమె రెండు చేతులు పట్టుకొని ప్రాధేయపడింది.

"అక్కా!" అంటూ ఆనందంతో పార్వతి హృదయంపై వాలిపోయింది గజ.

"మళ్ళీ ఓసారి వస్తావా గజా?" అని ఆప్యాయంగా ప్రశ్నించింది పార్వతి.

"అలాగే వస్తా" నంటూ కళ్లు తుడుచుకొని సంతోషంగా వెళ్ళిపోయింది. పార్వతి మెల్లగా గదిలోకి వచ్చింది. నర్సింగరావు వెనక్కి చేతులు కట్టుకొని పచార్లు చేస్తున్నాడు.

"మాసేవా...నీ అనుమానం చేత ఆ లేత హృదయం ఎంత బాధపడిందో?" పతి పలుకులు విని పార్వతి లజ్జతో బాధతో మొగం దించుకుంది. ★

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్ అనువాదం: 'వినాయక'

## 7
## హంతకుల వార్తాహరుడు

మంత్రికింక ఒకేఒక్క కబురు పంపించాలి! ఇంతకుపూర్వం ఆయనకు పంపించిన హెచ్చరికలో ఆ హంతకులవిధంగా బెదిరించారు! "మంత్రివర్యా! మేము మీకింకా ఇంకొక హెచ్చరిక పంపిస్తున్నాం! అది బుట్టదాఖలు చెయ్యరని మా ఆశ! ఇక మేము పంపించే చిట్ట చివరి ఉత్తరం మాలో ఎవరో ఒకరం స్వయంగా వచ్చి మీ కందిస్తున్నాం."

ఈవాక్యం చదువుకునేసరికి పోలీసులందరి గుండెలు మళ్ళీ కొంచెం కుదుట పడ్డాయి! మొత్తంమీద ఈ అల్లరి బయలుదేరిన తరవాత పోలీసులకు కాస్త ఆశా కిరణంలా కనిపించిందిది ఒక్కటే! హంతకుల నిజాయితీమీద పోలీసులందరికీ గట్టి నమ్మకం కుదిరింది. ఈ అపూర్వ హంతకులు వట్టి సామాన్యహంతకులు కారనీ, చిట్టచివరికి వాళ్లు చెప్పేదంతా చేసేతీరతారనీ అందరూ నిశ్చయించారు. లేకపోతే సర్ ఫిలిప్ రేమన్ ప్రాణ సంరక్షణ కింతటి హంగామా చెయ్యవలసిన అవసరమే లేకపోయేది! మహా భయంకరంగా పరిణమించిన ఆ హంతకుల నిజాయితీ అంతటిది!

ఈ విధంగా ఈ ఉత్తరాలు రాస్తూండడంవల్ల ఎప్పుడో ఒకప్పుడా హంతకులు దొరక్కపోతారా! అని కొంత మంది లోలోపల ఉబలాట పడ్డారు! ఈఉత్తరం పోస్టులోనే వచ్చింది! దానిమీద 'బాల్హామ్, మధ్యాహ్నం 12.15' అనే పోస్టుముద్రమాత్రమే ఉంది! అంతే!

కార్యదర్శితో ఈ విషయమై ప్రస్తావిస్తూ సర్ ఫిలిప్ రేమన్ అదంతే తనకేమీ పట్టనట్టుగా, అంటే అంటనట్టుగా మాట్లాడాడు.

కాని సూపర్నెంట్ ఫాల్మౌత్ కొంచెం కంగారు పడుతూ ఇలాగన్నాడు.

"మీకు పూర్తిగా బందోబస్తు ఏర్పాటు చెయ్యడమా? మానడమా? అన్నదే ఇప్పుడొక పెద్ద గడ్డు సమస్యగా తయారయింది! బందోబస్తు ఏర్పాటు చేస్తే మరి వాళ్ల ఆటలింక సాగవు! లేక పైపైన ఈ బందోబస్తు తీసి వేసినట్టు నటిస్తే వాళ్లు మనం వేసిన వలలో పడి తీరతారు.

ఇది మంత్రికోసం వేసిన ప్రశ్న! అతడు కుర్చీలో చదికిలబడి కూర్చుని ఈ ప్రశ్న విని కొంతసేపటికి సూటిగా ఇలాగడిగాడు:

"మొత్తంమీద నన్ను మీరొక ఎరగా ఉపయోగించాలని చూస్తున్నారన్నమాట!

**జరిగిన కథ:-**

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవం జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లండులో మకాంవేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు.

'అపూర్వహంతకులు' ఆ చట్టం ప్రవేశపెడితే చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు. 'బాకా'ఆ ఉత్తరం ప్రకటించడంతో ఊరూ వాడా గుప్పుమంది.

పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టే ముందు ఒకసభ్యునికి—పార్లమెంటు సభ్యులు చట్టం ఆమోదించ కూడదని హెచ్చరిస్తూరాసిన బెదిరింపు ఉత్తరం అందింది.

తరవాత 'అపూర్వ హంతకులు' లిమిటెడ్ కంపెనీ పేర ఒక పెద్దభవనం అద్దెకు తీసుకుంటారు. దానిలో మాన్ఫ్రెడ్ గోన్సాలెజ్ లిద్దరు ఒక మారణసదార్థం తయారు చేస్తారు. పిమ్మట 'బాకా'లో ఒక దురంతం జరిగింది. సంపాదకునికి కూడా ఒక బెదిరింపు ఉత్తరం అందింది. ఆ తరవాత థేరీ 'బాకా' కార్యాలయంలో ప్రత్యక్షమైనాడు! అతడు 'అపూర్వహంతకుల' గుట్టు బయటపెట్టేలోగా ఒక ముసుగుమనిషి రివాల్వరుతో అక్కడివారిని బెదిరించి, థేరీని విడిపించుకుపోతాడు. తరవాత హంతకులు మంత్రి హత్యకోసం చెయ్యవలసిన ఏర్పాటులన్నీ చేశారు.

# ★ అపూర్వ హంతకులు ★

డిటెక్టివ్ ఆ విషయం మంత్రికి కొంచెం విశదపరుస్తూ—

"అబ్బే అదికాదు! మా ఉద్దేశం! వాళ్ళకీవిధంగా ఒక చిన్న అవకాశం ఇద్దామని!" అన్నాడు. మంత్రి రుసరుస లాడుతూ—

"అవును! నా కదంతా బోధపడిపోయింది!" అన్నాడు.

డిటెక్టివ్ మళ్లీ మొదలు పెట్టాడు:

"పార్లమెంటులో ఆ దురంతం ఎలాగ జరిగిందో మా కిప్పుడిప్పుడే తెలిసింది. అది జరిగిన రోజున పొద్దున్నపూట పాత సభ్యుడొకడు పార్లమెంటు భవనంలో ప్రవేశించాడు!!

"ఆఁ!" అన్నాడు మంత్రి. "అసలా సభ్యుడు ఆవేళ పార్లమెంటు భవనంలో అడుగుపెట్టనే లేదు! తరవాత పార్లమెంటు సభ్యుల హాజరుపట్టీ తీసి చూస్తే – ఆ సంగతి కాస్తా బయటపడింది! పార్లమెంటు దురంతాన్ని గురించి అహోరాత్రాలదే పనిగా పనిజేస్తే – రెండుమూడు రోజుల క్రితమే ఈ సంగతి కాస్తాబయటపడింది!"

సర్ ఫిలిప్ హఠాత్తుగా కుర్చీలోంచి లేచి నిలబడి గబగబా అటు, ఇటు పచారు చేస్తూ ఇలాగన్నాడు.

"అయితే వాళ్ళకీ దేశం అనుపానులన్నీ బాగా క్షుణ్ణంగా తెలుసు నన్నమాట!"

"అవును! వాళ్ళ కిక్కడి పరిస్థితులు, అనుపానులు అన్నీ బాగా తెలుసునన్నమాటే! మన మీది కివ్వాడిది కూడా విరుచుకుపడింది!"

తరవాత డిటెక్టివ్ మంత్రి కేసి పరిశీలనగా చూసి, క్రమ క్రమంగా కంఠస్వరం తగ్గించివేస్తూ ఇలా భరవసా ఇచ్చాడు.

"వీళ్ళీవిధంగా వేషాలుమార్చేయడంలో కూడా మంచి నేర్పరులైతే – వీళ్లని సామాన్యహంతకుల జాబితాలో జమకట్టడానికి వీలులేదు! ఇది నిజంగా చాలా భయంకరమైన పరిస్థితే! ఇంతకీ ఇదంతా వాళ్లెందుకు తలపెట్టారో మన కేమీ తెలియడం లేదు! కాని మహాకట్టుదిట్టంగా పని చేస్తున్నారు. అందులో మాత్రం ఏమీ అనుమానంలేదు! వారిలో ఒకడు పట్టపగలే వేషం మార్చేసి మాయచెయ్యడంలో చాలా ఘటికుడు! నా కిప్పుడు అతడంటేనే బాగా భయంపట్టుకుంది!"

సర్ ఫిలిప్ రేమన్ కిదంతా వినేసరికి ఒళ్లు మండిపోయింది. ఎదురుగా ఉన్న బల్లమీద ఒక్క దెబ్బకొట్టి గట్టిగా అరిచాడు.

"అబ్బబ్బా! నాకిదంతా వింటూంటే ఒళ్ళు మండిపోతూంది! ఈ డిటెక్టివులు, ఈ ముసుగుమనుష్యులు, ఈ హంతకులు – ఏమి టీగోలంతాను! ఇదంతా చిట్టచివరికొకచచ్చు చవకబారు స్టంటు నాటకంలా తయారైందే!"

"ఎల్లాగో అల్లాగ మీ రొకటి రెండు రోజులదాకా కాస్త ఓపిక పట్టాలి మరి!" అన్నాడా పోలీసు ఉద్యోగి.

ఈ హంతకులు మంత్రికే గాక, పోలీసు ఉద్యోగులందరికీ కూడా ఉరితాళ్ళలా తయారైనారు.

ఆ పోలీసుద్యోగి కొంచెంసేపల్లాగే తటపటాయించి—

"ఇంతకీ ఈ మాయంత్రం ఏవి బందోబస్తులు చెయ్యాలో మేమింకా ఒక నిర్ధారణకు రానేలేదు!" అన్నాడు.

మంత్రి ముక్తసరిగా "ఏదో మీ యిష్టం వచ్చినట్లు చెయ్యండి!" అన్నాడు.

తరవాత ఒక నిమిషం ఊరుకుని—

"ఇంతకీ నన్ని రాత్రి పార్లమెంటుకు వెళ్ళనిస్తారా?" అన్నాడు.

"అది ఇంకా నిశ్చయించ లేదు!" అన్నాడు డిటెక్టివ్.

"అయితే ఈ ఏర్పాటులన్నీ చాలా రహస్యంగా దాస్తున్నారన్నమాట!"

"అవును! ఇవి రెండో కంటివాడి కెవడికీ తెలియనివ్వడం లేదు!"

"—అయితే ఇవి ఎవరికి తెలుస్తాయి?",

"మీకు, కార్యదర్శికీ, కమీషనరుకు నాకు తప్ప—ఇంకెవరికీ తెలియవు!"

"మరి ఇంకెవరికీ తెలియవన్నమాట!"

"తెలియవు! ఇందులో ఇక మనం భయపడవలసిం దేమీ లేదు! మీ రాకపోకలు జాగ్రత్తగా అతి రహస్యంగా అట్టేబెడితే ఇక మన కేమీ ఇబ్బంది ఉండదు!"

"ఈ యేర్పాటు లన్నీ ఎక్కడయినా ఒకచోట రాసి పెట్టారా?"

"లేదు! ఈ విషయంలో రాతకోత లేమీ జరగలేదు. ఇవ్వన్నీ నిశ్చయించిన తరవాత కొందరికివి నోటిమాట ద్వారానే తెలియజెయ్యడం జరిగింది. చివరికి ప్రధానమంత్రికి కూడా ఈ యేర్పాట్ల రహస్యం తెలియదు.

దీనితో సర్ ఫిలిప్ రేమన్ ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి—

"సరే! అన్నీ సరిగానే జరుగుతున్నాయన్నమాట!" అన్నాడు. డిటెక్టివ్ వెళ్ళబోతూంటే మంత్రి మళ్ళీ అతనితో ఇలాగన్నాడు.

"ఒకసారి పోలీస్ కమిషనరుకు కబురు పంపించాలి. వెంటనే ఆయన్ని ఒకసారి చూడాలి. ఒక అరగంటసేపు నేనిక్కడ

ఒక ప్రఖ్యాత చిత్రకారుడికి, ఒక ప్రసిద్ధ శస్త్రవైద్యుడు ఆపరేషన్ చేశాడు. రోగి కోలుకున్న తరువాత, డబ్బు ఇవ్వబోగా, వైద్యుడు తిరస్కరించాడు. చిత్రకారుడు, చివరికి తను వేసిన ఒక మంచి చిత్రాన్ని బహూకరించాడు.

"మీరు ఇవ్వబోయిన డబ్బుకన్న, ఈ చిత్రం ఖరీదు పదింతలుంటుంది. దీన్ని నేను పుచ్చుకోవాలంటే, ఒక షరతుకి ఒప్పుకోవాలి" అన్నాడు వైద్యుడు.

సరే చెప్పమన్నాడు చిత్రకారుడు.

"ఏంలేదు. నా రుసుముకి ఇది పదింతలు కాబట్టి, మీరు మున్ముందు చేయించుకునే తొమ్మిది ఆపరేషన్‌లకీ నాదగ్గరకే రావాలి."

ఉంచడానికి వీల్లేదు. ఈలోగా మీరిక్కడే మీగదిలో కనిపెట్టుకుని ఉండాలి."

తరవాత డిటెక్టివ్ ఆ పక్కగా ఉన్న గదిలోకి వెడుతూంటే మంత్రికూడా అతనిలో అక్కడికి వెళ్ళాడు. మంత్రి కార్యదర్శి అక్కడే ఉన్నాడు.

ఫాల్‌మాత్ పోలీసు బంట్రోతు తీసుకువచ్చిన ఒక పెద్ద లాంగ్‌కోటు తొడుక్కుంటూ మంత్రితో మెల్లిగా ఇలాగన్నాడు.

"నాకు గత రెండుమూడు రోజులనుంచీ ఎవరో వెంటాడిస్తున్నారనే అనుమానం ఒకటి పట్టుకుని పీడిస్తూంది. అందుచేత ఎప్పుడూ మోటారుకారులోనే తిరుగుతున్నాను. కారులో వెడుతూంటే వెంటాడించడం అంత తేలిక కాదు."

తరవాత జేబులోనించి పెద్ద పెద్ద కళ్ళద్దాలజోడు తీసి గబగబా కళ్ళకు తగిలించుకొని ఒక నవ్వు నవ్వి ఇలాగన్నాడు:

"ఇలాంటి వేషం వెయ్యడానికి ఇదే మొదలు! ఏదో నాటకంలో డిటెక్టివ్‌లాగ నటించడం అంటే నాకు జాస్తిగా, కిట్టదు. అయినా ఇప్పుడు మరి తప్పడంలేదు! నా 25 ఏళ్ల సర్వీసులోనూ ఎప్పుడూ ఇలా కిందికి దిగజారిపోలేదు! ఏం చెయ్యను!"

ఫాల్‌మాత్ వెళ్ళిపోగానే మంత్రి మళ్ళీ తన గదిలోకి తిరిగి వచ్చేశాడు.

అలాగ ఒంటరిగా ఆ గదిలో - ఆ బల్లకెదురుగా కూర్చోగానే అతనికి లోలోపలినుంచి బాగా విసుగు, చిరాకు పుట్టుకొచ్చాయి. వాటితోబాటు కొంచెం గుండెబెదురుకూడా ప్రారంభమైనది. బెల్ మోగిస్తే ఇద్దరు డిటెక్టివు లెదురుగా వచ్చి నిలబడతారు! అయినా అతనికా బెదురు వదలలేదు! హమేషా ఆ నలుగురు హంతకులు అతని కళ్ళలో నాట్యమాడుతూండే వారు. అందుచేత కొత్త చీమ చిటుక్కుమనేసరికి అతని కెక్కడలేని కంగారు, హడలు పుట్టుకొచ్చేవి! ఎదురుగా వున్న కలం చేత్తో పట్టుకుని కాగితాలమీద ఏదేదో బరకడం ప్రారంభించాడు. తీరా తను రాసిందేదో పరిశీలనగా చూసేసరికి అది ఆ నలుగురు అపూర్వ హంతకుల్ని సూచించే నాలుగో అంకె!

ఇంతా చేస్తే పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టడం అవసరమా! దీనికోసం ప్రాణత్యాగానికికూడా సిద్ధపడవలసిన అవసరం ఏమి వుంది? అతడీవిషయాలన్నీ ఆలోచిస్తూ కూర్చున్నాడు. 'ఇందులో అనవసరంగా ఎంత స్వార్థత్యాగం చెయ్యాలి!' అనుకున్నాడు.

తరవాత మంత్రి "ఆ ఇవ్వన్నీ జరిగిపోతాయనుకుని నేను అనవసంగా కంగారు పడుతున్నాను. ఇంతా చేస్తే వాళ్లు సరిగ్గా చెప్పిందంతా చేసే తీరతారని నమ్మకం ఏమిటి?'' అనుకున్నాడు.

ఇంతలో తలుపెవరో తట్టిన చప్పుడైంది. అతడు ఫాల్‌మాత్.

"ఫాలమాత్! అప్పుడే తిరిగి వచ్చేశావేమిటి!" అన్నాడు మంత్రి.

సూపరింటెంట్ జేబురుమాల్‌తో ఒకసారి మూతితుడుచుకొని, జేబులోనించి నీలిరంగు కవరొకటి పైకి తీశాడు:

"ఈ కవరు మీ జాగ్రత్తలో ఉంచడం మంచిదని అనుకుంటున్నాను. తీరా వీధిలోకి వెళ్లాక నాకీసంగతి జ్ఞాపకం వచ్చింది. ఇది నా దగ్గిర ఉండగా ఏదైనా అఘాయిత్యం జరిగితే అప్పుడేమనుకొన్నా ఏమీ లాభంలేదు."

మంత్రి అది తీసుకుని—

"ఏమిటిది?" అన్నాడు.

"ఇది నాదగ్గిర ఉన్నట్టు తెలిసిందంటే వెంటనే నాప్రాణా లెగిరిపోయాయన్నమాటే!'' అని సూపరింటెంట్ అక్కడనించి కదలబోయాడు. "ఇంతకీ ఇదేం చెయ్యాలి'' "నేను తిరిగి వచ్చేదాకా మీ దగ్గిర జాగ్రత్త పెట్టండి!''

అని చెబుతూనే సూపరింటెంటు ఆపక్క గదిలోకి వెళ్ళివెంటనే తలుపు మూసేశాడు. అక్కడ కాపలా కాస్తున్న పోలీసు శాల్యూట్ చెయ్యగానే అది అందుకుంటూనే వెళ్ళి తన కారులో కూర్చున్నాడు.

సర్ ఫిలిప్ ఆ కవరుకేసి చూస్తూ అది ఏమై ఉంటుందా?" అని అనేక విధాలుగా మథనపడ్డాడు.

దానిమీద "అతి రహస్యం" అని ఉంది. ఆపైన 'సి. ఐ. డి. డిపార్ట్‌మెంట్. స్కాట్లండ్ యార్డ్' అనే అక్షరాలున్నాయి.

'ఏదో పోలీసు రిపోర్టయి ఉంటుంది.' అనుకున్నాడు మంత్రి. లేకపోతే ఆనాడు తనరక్షణకోసం చేసిన ఏర్పాట్ల వివరాలేమో అనుకున్నాడు మళ్ళీ! అంతే! అవ్వే అయిఉండాలి! తెలిసిపోయింది! అందులో కథ అంతా! అనుకున్నాడు మంత్రి.

తరవాత ఆ కవరు డ్రాయరులో పెట్టి, ఇంకా అర్జంటుగా చూడవలసిన మిగిలిన కాగితాలేవో చేత బుచ్చుకున్నాడు.

అవి ఆవేళ పార్లమెంటులో ప్రవేశపెట్టబోయే విదేశీయ బహిష్కార చట్టానికి సంబంధించిన కాగితాలు.

ఆ చట్టం ఏమీ అంత పెద్ద చట్టంకాదు! అందులో ఉన్న క్లాజులన్నీ కలిపి నాలుగు పుంజీలకంటె ఎక్కువ లేవు! చట్టం పాసుకాదేమోనన్న పెద్ద భయం కూడా ఏమీ లేదు! ప్రభుత్వానికి కావలసినంత మెజారిటీ ఉంది! పైగా దీనికోసం సభ్యులందరు పార్లమెంటుకు హాజరయి తీరాలనే హుకుములు కూడా జారీ అయ్యాయి! పైగా ఈ సమావేశంలో ఏదో చారిత్రికమయిన మహత్తర సంఘటన ఒకటి జరగగలదనే తహతహ కూడా తోడైంది! చివరికిదంతా విషాదాం

# ★ అపూర్వ హంతకులు ★

తంగా పరిణమించ గలదనీ ఆ విషాద సంఘటన తాము కళ్లారా చూచి ఆనందించవచ్చు ననీ చాలామంది లోలోపల ఎంతో ఉవ్విళ్లూరారు!

సర్ ఫిలిప్ రేమన్ ఆ కాగితాలన్నీ జాగ్రత్తగా పరిశీలించాడు. ఈ చట్టం పాసు చేయించడానికి కొన్ని పెద్ద అడ్డంకులే ఉన్నాయి. మంత్రి చర్చల్లో అవి ఎదుర్కొనే పద్ధతి అంతా ముందుగా మనస్సులో ఊహించుకున్నాడు. అందులో అతనికేమీ భయంలేదు. పార్లమెంటు చర్చల్లో మాటల పోరాటంలో ప్రత్యర్థులను పడగొట్టడంలో అతనికతడే సాటి! యుక్తికి పైయుక్తి పన్ని పైవారిని బోల్తా కొట్టించడం అంటే అతనికి మహా సరదా!

అయితే అపూర్వ హంతకుల వ్యవహారం తలుచుకుంటే మాత్రం అతనికి లోలోపల కొంచెం బాధ కలిగింది. వాళ్ళెవరో చంపేస్తామని బెదిరించడంవల్ల బయలుదేరిన బాధ కాదది! హంతకులు తలవని తలంపుగా ఈ చట్టం వ్యవహారంలో జోక్యం కలిగించుకొంటున్నారు. మంత్రి వాదోపవాదాల ద్వారా వాళ్ళని అడ్డుకోలేడుగదా! పార్లమెంటులో పన్నే పన్నాగాల కన్నింటికీ వాళ్ళతీతులు!

కాని మంత్రి ఏది ఏమయినా ఈ చట్టం పాసుచేయించి తీరాలనే నిశ్చయానికి వచ్చేశాడు. శత్రువులతో రాజీపడడం అంటే —అతని కెంతమాత్రం ఇష్టంలేని పని!

"ఏమయినా సరే! నేనీ చట్టం పాసు చేయించి తీరాలి! తీరాలి! తీరాలి!" అని గట్టిగా మూడుసారులు బిగ్గరగా అరిచాడు!

ఇంతలో పక్కనున్న టెలిఫోను గంట గణగణ మోగింది. చేతులమీద తల ఆనించి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్న వాడల్లా చటుక్కున టెలిఫోను చెవిదగ్గిర పెట్టుకున్నాడు.



టెలిఫోనులో అతని ఏజెంటు పోర్ట్‌లాండ్ భవనం పూర్తిగా ఖాళీ చేయించిన విషయం అంతా పూసగుచ్చినట్టు చెబుతున్నాడు.

ప్రస్తుతం ఈ గందరగోళం అంతా అణిగిపోయేదాకా పోర్ట్‌లాండ్ భవనం పూర్తిగా మూసివెయ్యడమే మంచిదని మంత్రి నిశ్చయించాడు. అది తానుపయోగిస్తే - దాని మూలంగా తన నౌకరుల ప్రాణాలకు కూడా అపాయం కలగవచ్చునేమో, అని అతని భయం! ఒకవేళ ఆ నలుగురు హంతకులు పోర్ట్‌లాండ్ భవనంతోబాటు డౌనింగ్ స్ట్రీట్ భవనం కూడా బాంబులతో పడగొట్టి వెయ్యవచ్చును! కనకనే ముందు జాగ్రత్త కోసం అతడా పోర్ట్‌లాండ్ భవనం మూసి వెయ్యవలసిందని చెప్పాడు.

ఇంతలో తలుపు తట్టిన చప్పుడు! గుమ్మంలో డిటెక్టివ్ ప్రత్యక్షం! వస్తూనే అతడు మంత్రి నెంతో ఆత్రంగా పరిశీలించాడు:

"ఎవరు లోపలికి రాలేదా?" అని అడిగాడు.

రేమన్ ఒక చిన్న చిరునవ్వు నవ్వి ఇలాగన్నాడు: "—అంటే ఆ నలుగురు ఒక మనిషిద్వారా తమ సందేశం పంపించారా? లేదా? అని నీ వడుగుతున్నావన్నమాట! వాళ్లెవర్నీ పంపించలేనే లేదు! మరి నీ మనస్సిప్పుడు కుదుటపడిందా?"

డిటెక్టివ్ ముఖంలో "అమ్మయ్యా! బతికాను!" అన్న భావం స్పష్టంగా కనబడింది. ఆపైన అతడిలాగన్నాడు:

"మనం చాలా అదృష్టవంతులం! నేను లేనప్పుడే ప్రమాదం జరిగిందో అని హడలిపోయాను! దానికేంగాని మీ కిప్పుడొక వింత వార్త పట్టుకొచ్చాను!"

"నిజంగా! ఏమిటది!"

"పోలీసు కమిషనరు కిప్పుడే అమెరికా నించి ఒక కేబిలువచ్చింది! ఆదేశంలో ఇటీవల రెండు హత్యలు జరిగాయి. అప్పటి నించీ వాళ్ళు ప్రతి చిన్నవిషయంలోను బాగా కూపీతీశారు. అదంతా మనకొక కేబిల్ కొట్టారు. ఇదిగో ఆ కేబిల్!"

అని డిటెక్టివ్ మంత్రి బల్లమీద ఒక కాగితం పెట్టాడు. అది చికాగో పోలీసు కమిషనరు స్కాట్లండు యార్డ్ పోలీసు కమిషనరుపేర రాసిన ఉత్తరం. అది ఇది:

"ఆ అపూర్వహంతకు లేదన్నా ప్రతిజ్ఞ పట్టారంటే - అది నెరవేర్చి తీరతారని సర్ ఫిలిప్ రేమన్‌కు నచ్చచెప్పండి! వాళ్లు ఫలానారోజు లోపుగా ఫలానావిధంగా చంపివేస్తామని బెదిరించారంటే సరిగా

> ఒక సుబ్బారావుకి, భార్య డబ్బుయావ చూసి ప్రాణం విసుకెత్తింది.
>
> "ఎంతసేపూ డబ్బు, డబ్బు డబ్బు. ఈ రూపాయల సంగతి తప్ప ఇంకోటి తోచదు కాబోలు బుర్రకి."
>
> "లేకేం. కారులు, చీరెలు, నగలూ ఎన్నో కొనాలి డబ్బుంటే కదా." అందావిడ నిర్లక్ష్యంగా.

అక్షరాలా అలాగే హత్యచేసేస్తారు! ఇటీవల ఇక్కడ ఒక హత్యా దురంతం జరిగింది. తరవాత మాకొక చిన్న నోటుబుక్కు దొరికింది. బహుశా వాళ్లది పారబాటుగా అక్కడ పారవేసి ఉంటారని అనుకుంటున్నాము. అందులో మూడు పేజీలు పూర్తిగా కాళీ! తరవాత "హత్య చెయ్యడంలో ఆరు మార్గాలు!" అనే శీర్షిక కింద కొన్ని పంక్తులున్నాయి. ఆ పంక్తుల చివర 'సి' అనే అక్షరం తప్ప ఇంకేమీ లేదు!

సర్ ఫిలిప్ రేమన్ ఈ క్రింది సంగతులు చాలా జాగ్రత్తగా జ్ఞాపకం ఉంచుకోవాలి! ఎప్పుడు ఎలాంటిదైనా సరే! కాఫీ తాగకూడదు! ఉత్తరాలు బంగీలు తెరిచేటప్పుడు చాలా జాగ్రత్తపడాలి! ప్రత్యేకంగా నమ్మదగినవాళ్లు కళ్లెదురుగా తయారుచేసిన సబ్బుతప్ప మరిఒకరకం సబ్బు వాడకూడదు. రాత్రింబగళ్లు పోలీసులు కాపలా కాసే గదిలోనే కూర్చోవాలి! మంత్రి పడుకునే గది అంతా బాగా తణిఖీ చెయ్యాలి! దానిలో విష వాయువులు ప్రవేశపెట్టడానికేదయినా అవకాశం ఉందేమో పరిశీలించాలి! వెంటనే ఈ విషయాలన్నీ జాగ్రత్తగా పరిశీలించడానికిద్దరు మనుష్యుల్ని పంపిస్తున్నాం!"

అని డిటెక్టివ్ ఆ కేబిల్ పూర్తిగా చదివాడు. నిజానికతనా కేబిలంతా పూర్తిగా చదవనేలేదు! ఆ కేబిల్ చిట్టచివర "ఆ ఇద్దరు అక్కడికి చేరుకునేసరికి జరగవలసింది కాస్తా జరిగేఉంటుందని భయపడుతున్నాం!" అనే వాక్యంకూడా ఉంది! కాని డిటెక్టివ్ అది ఒదిలేశాడు!

"అయితే నువ్వేమంటావు!" అన్నాడు మంత్రి.

"అనడానికేముంది! ఈ ఉత్తరంలో ఇచ్చిన హెచ్చరికలన్నీ అక్షరాలా పాటించాలి! అమెరికా పోలీసు లివ్వన్నీ ఊరికే ఉత్తపుణ్యానికి రాయరుగదా! ఇంకా వాళ్లకెన్నెన్నో సంగతులు తెలిసిఉండాలి! అందుచేత వాళ్లు రాసినదంతా తూచా తప్పకుండా పాటించాలి!"

ఇంతలో తలుపు గట్టిగా తట్టినచప్పుడు వినిపించింది. వెంటనే రేమన్ ఆంతరంగిక కార్యదర్శి కంగారుగా లోపలికి వచ్చాడు. చేతుల్లో ఏదో పేపరుంది. లోపలికి వస్తూనే—

"ఇదిగో! ఈ పేపరు చూడండి! ఆ హంతకులు నలుగురు అన్నదంతా తప్పిపోయిందని ఒప్పేసుకున్నారు!" అన్నాడు.

"ఆఁ నిజంగానే!" అన్నాడా డిటెక్టివ్ ఆ పేపరందుకుంటూ.

"ఏమిటీ ఘోషంతా!" అన్నాడు మంత్రి తీవ్రంగా.

"అబ్బే! ఏమీ లేదు! ఆ నలుగురు తమ లక్ష్యాల్ని గురించి ఈ పేపర్లో ఒక వ్యాసం రాశారు!"

"ఏమిటా పేపరు!"

"బాకా!—ఫేరీని విడిపించుకు పోయినప్పుడా పేపరు ఎడిటరూ వాళ్ళ నీవిషయంలో ఒక వ్యాసం రాసి పంపించమన్నాట్ట! ఆ విడిపించుకు పోయిన మనిషి వెంటనే ఒక వ్యాసం రాసి పంపించాడు. ఇదిగో! ఆ వ్యాసం. దీని చివర వాళ్లు తమ ఎత్తులేమీ పారలేదని ఒప్పేసుకున్నారు. ఇంకా—"

డిటెక్టివ్ హఠాత్తుగా అతని చేతుల్లోనించి ఆ పేపరు లాక్కుని—

"అపూర్వ అంతకుల లక్ష్యాలు!" అని చదివాడు. వెంటనే—"మరి వాళ్లు తప్పు ఒప్పేసుకున్నట్లెక్కడా లేదే!" అన్నాడు.

ఆంతరంగిక కార్యదర్శి పెన్సిలుతో అట్టడుగు పేరా చూపిస్తూ—

"ఇదిగో! ఇక్కడ పెన్సిలుతో గుర్తుపెట్టాను. చూడండి!" అని వణికి పోతున్న వేలితో అది చూపించాడు.

ఆ తరవాత డిటెక్టివ్ అదంతా చదివాడు:

"మేము ప్రతీదీ జాగ్రత్తగా తూచి తూచి మరీ అమలులో పెడతాం! ఏదైనా ఒక్క చిన్న పొరబాటు జరిగిందంటే వెంటనే మా తప్పు ఒప్పేసుకుంటాం! ఈ ప్రపంచంలో దైవ నిర్ణయం అమలు పరుస్తున్నామనే దృఢ విశ్వాసం మాకుంది! ఈ న్యాయ నిర్వహణలో ఎలాంటి ఇబ్బంది రాకుండా ఎంతో జాగ్రత్త వహించడం మా పవిత్ర కర్తవ్యం! అందుచేత ప్రతీ హత్యకీ ముందుగా పూర్వరంగం అంతా అక్షరాలా అమలులో పెట్టడం తప్పని సరి! ఉదాహరణకు మా చిట్టచివరి హెచ్చరిక మంత్రికి అందజేయడం చాలా ముఖ్యం! అందులోను ఆ హెచ్చరిక ఆ మంత్రికి ఒక వ్యక్తిద్వారా అందజెయ్యడంకూడా చాలా అవసరం! మాపద్ధతిలో ఇది చాలాముఖ్యం! ఇది అమలు చెయ్యడానికి కావలిసిన జాగ్రత్తలన్నీ తీసుకోవడం జరిగి పోయింది. ఇది ఈవేళ సాయంత్రం ఎనిమిది గంటలలోపుగానే మంత్రికి అంది పోవాలి. ఇది జరగకపోతే మేము వేసుకున్న ప్లానులన్నీ మట్టికొట్టుకు పోయాయన్నమాటే! దీనితో బాటు మంత్రి హత్యకూడా ఆపివెయ్యవలిసిన అవాంతర పరిస్థితి కూడా ఏర్పడిపోతుంది!"

డిటెక్టివ్ మరి ఆపైన చదవడం మానేసి, నిరుత్సాహంగా ఇలాగన్నాడు:

"ఓస్! ఇంతా చేస్తే ఇదేనా? మీ ఉత్సాహం అదీచూసి కొత్తదేదో కొట్టుకొచ్చారేమో అనుకున్నాను! ఇంతా చేస్తే ఇది నేనింతకు ముందే చదివానే! ఈ వ్యాసం అందడంతోటే బాకా ప్రతిక దీని కాపీఒకటి స్కాట్లండ్ యార్డ్‌కు పంపించింది."

ఆంతరంగిక కార్యదర్శి బల్లమీద చేత్తో ఒక దెబ్బకొట్టి ఇలా అరిచాడు:

"ఇక మంత్రిని రక్షించవలిసిన అవసరమేమీ లేదు! తెలిసిందా! ఇక మంత్రిని ఎరగా ఉపయోగించవలసిన అవసరమే లేదు! ఇక ఏది చెయ్యాలన్నా కాస్త టైమెంతయిందో చూడడం మంచిది!"

వెంటనే డిటెక్టివ్ జేబులో చెయ్యిపెట్టి వాచీ పైకితీశాడు. దానికేసి చూస్తూనే ఈలవేశాడు! వెంటనే "రైట్!" ఎనిమిదిన్నర అయిపోయింది!" అన్నాడు మెల్లిగా.

ఆ ముగురు ఎంతో ఆశ్చర్యంతో నిశ్శబ్దంగా లేచి నిలుచున్నారు. ఒక్క క్షణం దాకా ఎవరు ఏమీ అనలేదు!

తరవాత సర్ ఫిలిప్—"ఇదంతా మనం అజాగ్రత్తగా ఉండడానికి వాళ్ళు వేసిన ఎత్తే!" అన్నాడు. డిటెక్టివ్ తల పంకించాడు.

"కాదని నా నమ్మకం. దీనిలో అనుమానమేమీ లేదు. అయినా ప్రతిక్షణం నేను

## ★ అపూర్వ హంతకులు ★

బందోబస్తు ఏర్పాటులన్నీ తణిఖీ చేస్తూనే ఉంటాను. కాని ఆ హంతకులు అడినమాట తప్పే బాపతు కాదని నా నమ్మకం. ఇన్నాళ్లనించీ నేనిటువంటి హంతకులమాటలేవీ నమ్మలేదు గాని—ఇప్పుడెందుచేతనో నమ్మకుండా ఉండలేక పోతున్నాను. వాళ్లు ఒక మనిషిద్వారా ఆ చిట్టచివరి సందేశం పంపించి ఉండకపోతే—మనం ఈ ఆపత్తు గడచి గట్టెక్కేశా మన్నమాటే!"

రేమన్ కంగారుగా ఆ గదిలో అటూ, ఇటూ పచారుచేస్తూ "మీకున్నంత ధీమాలో కొంచెం నాకుకూడా ఉంటే బాగుండును!" అన్నాడు.

మళ్ళీ తలుపు తట్టిన చప్పుడు! ఒక మఫ్టీలి పోలీసు లోపలికి వచ్చి—

"మంత్రిగారికి అర్జంటుగా ఒక టెలిగ్రాం!" అన్నాడు.

మంత్రి అది అందుకోబోయాడు.

డిటెక్టివ్ అతన్ని అడ్డగించి—

"మీరు టెలిగ్రాము లేవీ స్వయంగా విప్పి చదవకూడదు—అప్పుడే ఆ సంగతి మరిచిపోయారా?" అని తానే స్వయంగా అది అందుకుని పైకి చదివాడు: "ఇప్పుడే మాకొక టెలిగ్రాం అందింది: అది ఇది: "మేము మా చిట్టచివరి సందేశం మంత్రికి అందించేశాం! సం - నలుగురు హంతకులు" ఇది నిజమేనా? 'బాకా' సంపాదకుడు."

అది చదవడం ముగిస్తూనే డిటెక్టివ్ సూపర్నెంట్ ఫాల్‌మాత్ గాభరాపడుతూ—"ఇదేమిటి?" అన్నాడు.

సర్ ఫిలిప్ చిరాకుతో చిరచిరలాడుతూ ఉరిమాడు:

"అదేమిటో నేను చెబుతున్నాను విను! మీ అపూర్వ హంతకు లొక్క హంతకులే కాదు! వట్టి అబద్ధాలకోరులు! దగాకోరులు! తెలిసిందా? ఇక ఇక్కడినించి నీవు వాళ్ళ నిజాయితీనిగురించి ఇచ్చే ఉపన్యాసాలు కట్టిపెట్టవచ్చు!"

దీనికి డిటెక్టివ్ ఏమీ అనలేదు. కాని మొహం కొంచెం మాడింది. కంగారుగా పెదిమలు కొరుక్కుంటూ—

"నేను వెళ్ళిన తరవాత ఇంకెవరూ ఇక్కడికి రాలేదా?" అన్నాడు.

"ఎవ్వరూ రాలేదు!"

"నన్నూ మీ కార్యదర్శిని తప్ప ఇంకెవర్నీ మీరు చూడలేదా?"

"ఎవడూ నాతో మాటాడలేదు! నాకు పదిగజాల దూరంలో నరమానవుడెవడూ నిలబడలేదు! ఖాయమే!" అన్నాడు మంత్రి అతిధీమాగా!

ఫాల్‌మాత్ తలపంకించి దిగులుగా—

"ఏమిటో ఇదంతా చాలా అగమ్యగోచరంగా ఉందే!" అనుకున్నాడు తనలో తానే! తరవాత లేచి గదిద్వారం కేసినాలు గడుగులు వేశాడు.

ఇంతలో మంత్రికా నీలిరంగు కవరుమాట హఠాత్తుగా జ్ఞాపకంవచ్చింది:

"ఇదిగో! మీ కాయితాలేవో! మీరు జాగ్రత్తచేసుకోండి!" అని మంత్రి డ్రాయరులో దాచిన నీలిరంగు కవరు తీసి బల్ల మీద పడేశాడు.

డిటెక్టివ్ నిర్ఘాంతపోయి ఆ కవరందుకుంటూ—,

"ఇదేమిటి? ఈ కవరెక్కడిది?" అన్నాడు.

సర్ ఫిలిప్ ఏమీ చలించకుండా హుందాగా ఇలాగన్నాడు:

"ఆ అపూర్వహంతకులు చాలానిజాయితీ గల మనుష్యులన్న నమ్మకానికి గట్టిదెబ్బ తగలగానే ఈ కంగారు బయలుదేరినట్టు కనబడుతూంది! ఇక హంతకుల అనుపానులన్నీ బాగా తెలిసినవారి నెవరినైనా పంపించమని వెంటనే కమిషనరుపేర రాసేస్తాను!"

దినికి డిటెక్టివ్ ఏమీ తొణకుండా ఇలాగన్నాడు:

"ఓ! మీ యిష్టంవచ్చినట్టు చెయ్యండి!

నాకు చాతనయినంతవరకు నా డ్యూటీ నెరవేర్చాను! కాని నేను చేసేది ప్రతీదీ గట్టిగా పరీక్షు చేసుకుంటూనే ఉన్నాను. ఇంతకీ నే నేదో కవరిచ్చానంటున్నారు! ఆ కవరు మాట వింటూంటే నాకు చాలా కంగారుగా ఉంది!"

విదేశాంగమంత్రి ఎక్కడా చలించకుండా డిటెక్టివ్ కేసి చూస్తూదురుసుగా—

"మీరు నాకింతకుపూర్వం ఇచ్చిన కవరు మాటే చెబుతున్నాను." అన్నాడు మంత్రి. డిటెక్టివ్ మొహం వెల్ల వేసినట్లయింది.!

ఇక ఏమనడానికీ పాలుపోక—

"నేనసలు మళ్ళీ తిరిగి ఇక్కడికి రానేలేదే! కాగితాలంతకన్నా అప్పగించలేదు!" అన్నాడు.

వెంటనే బల్లమీద పడివున్న ఆ నీలిరంగు కవరు చించాడు. దానిలో ఇంకో బూడిదరంగు కవరు! అది చూడగానే 'ఆఁ' అని ఒక పెద్దకేక పెట్టి —

"ఆ హంతకులు పంపిన ఆఖరి సందేశం ఇక్కే!" అన్నాడు.

మంత్రి మొహంమీద మరి కత్తి వాటు వేసినా నెత్తురుచుక్క లేదు! ఒక్కసారిగా దిగాలు పడిపోయి—

"ఇది ఎవరిచ్చారు?" అన్నాడు.

డిటెక్టివ్ మొహం ముడుచుకొని "ఆ అపూర్వ హంతకుల్లోవాడే!" అన్నాడు వెంటనే.

"అంటే వాళ్లు తమ మాట నిలబెట్టుకున్నారన్నమాట!" అని ముగించాడు.

తరవాత ఒక్క అంగలో తలుపు దగ్గరికి వెళ్ళి అక్కడినించి ఆ పక్క గదిలోకి వెళ్లాడు. అక్కడ కాపలాకాసే పోలీసు కేసిచూసి—

"నేను వీధిలోకి వెళ్లడం నీకు జ్ఞాపకం ఉందా?" అన్నాడు.

"అవునుసార్! మీరు రెండుసార్లు వీధిలోకి వెళ్లారు. బాగా జ్ఞాపకం ఉంది!"

డిటెక్టివ్ తీవ్రంగా—

"రెండుసార్లా? చాల్చాలే! అయితే రెండోసారి నేనెలాగున్నాను!"

ఈ ప్రశ్నతో పోలీసు బాగా గాభరాపడి—

"మీకుమల్లేనే!" అన్నాడు.

"అదికాదు! నా వేషం ఎలాఉంది?"

"మీ లాంగ్ కోటు మీరు—అచ్చంగా మీలాగే ఉన్నారు సార్!"

"పెద్ద పెద్ద కళ్లద్దాలున్నాయా?"

"ఉన్నాయి సార్!"

"నేనూ అలాగే అనుకున్నానులే!" అన్నాడు ఫాల్‌మాత్ మండిపడుతూ. తరవాత అక్కడ హాలు పాలరాతి మెట్లమీద తొందర తొందరగా అటు ఇటు పచారు సాగించాడు. అతనికి ఆ ప్రాంతంలో పహరా తిరుగుతున్న నలుగురు పోలీసు జవానులు ఒక్కసారిగా శాల్యూట్ చేశారు! ఫాల్‌మాత్ వాళ్ళ దగ్గిరికి వెళ్లి ఒక సార్జంటుతో—

"నేను వీధులోకి వెళ్ళడం నీకు జ్ఞాపకం ఉందా?" అన్నాడు.

"ఉంది సార్! రెండుసార్లు వెళ్ళారు!"

"రెండుసార్లేమిటి? నీ బొంద!" మండిపడ్డాడు. డిటెక్టివ్!

"నేను మొదట వెళ్ళిన తరవాత మళ్లీ ఎంత సేపటికి తిరిగి వచ్చాను." అన్నాడు మళ్లీ.

"అయిదు నిమిషాల్లో సార్" అన్నాడు సార్జంట్ ఆశ్చర్యపడి!

ఫాల్‌మాత్ తనలో తాను "ఈ అయిదు నిమిషాలలోను వాళ్ళు తయారైనా రన్నమాట!" అనుకున్నాడు.

మళ్ళీ "నేను నా కారులోనే తిరిగి వచ్చానా?" అన్నాడు.

"అవును సార్!"

హఠాత్తుగా డిటెక్టివ్ హృదయంలో ఒక ఆశాకిరణం రేకెత్తింది! ఒక్కసారిగా అతనికి ముచ్చెమటలు పోశాయి! ఊపిరాడని తొందరతో—

"అయితే ఆకారు నెంబరు చూశావా?" అన్నాడు.

"చూశాను సార్"

డిటెక్టివ్ సంతోషంతో ఒక్కసారిగా ఉబ్బితబ్బిబ్బైపోయి ఆసార్జెంటును అమాంతంగా కౌగిలిం చేసుకోవాలనుకున్నాడు:

"సరే! ఏమిటా నెంబరు?"

"A 17164"

డిటెక్టివ్ వెంటనే ఆ నంబరునోట్ చేసుకుని ఇంకొక సార్జంటుతో—

"త్వరగా స్కాట్లండ్‌యార్డ్‌కు వెళ్ళి ఆనెంబరు కారుగల ఆసామి ఎవరోపట్టుకో! ఆయన దగ్గరికి వెళ్ళి ఆ కారులో ఎక్కడికి వెళ్ళిందీ తెలుసుకో! అవసరమైతే ఆయన్ని వెంటనే అరెస్టు చేసెయ్!"

ఫాల్‌మాత్ వెంటనే మంత్రి గదిలోకి వెళ్ళాడు. మంత్రి ఆ గదిలో ఇంకా గాభరాగా అటూ ఇటూ పచారు సాగిస్తూనే ఉన్నాడు. ఆ కార్యదర్శి వేళ్ళతో బల్లమీద కొడుతూ లోలోపల ఎందుకో మథన పడుతున్నాడు. ఎదురుగా పడిఉన్న ఆ హంతకుల ఉత్తర ఇంకా చించనే లేదు!

ఫాల్‌మాత్ మంత్రి కంతకుపూర్వం జరిగిన వ్యవహారం అంతా జాగ్రత్తగా విశదపరిచాడు.

సరిగా నేననుకున్నట్లే జరిగింది. మీరు చూపిన మనిషి సరిగా నా వేషం వేసుకున్నాడు. అతడా అపూర్వ హంతకులలో వాడే! కాని మంచి అదనులో లోపలికొచ్చాడు! మావాళ్ళందరి కళ్ళూ కప్పేశాడు. సరిగా నా కారులాంటిదే ఇంకో కారు సంపాదించాడు! నేను కారులో డౌనింగ్ స్ట్రీట్ దాటడం చూసి తపీమని ఆ కారులో లోపలికి వచ్చేశాడు. అయితే మనకిక ఇందులో ఒకటే ఆశ కనబడుతూంది! అదృష్టవశాత్తు ఆ సార్జంటా కారు నెంబరు చూశాడు. ఆ నెంబరునిబట్టీ-ఆ కారునిబట్టీ అతగాణ్ణి పట్టుకోవచ్చని అనుకుంటున్నాను!"

ఇంతలో నౌఖరక్కడికి వచ్చి "మీరు పంపించిన సార్జంటు మళ్లీ తిరిగివచ్చాడు సార్!" అన్నాడు.

ఫాల్‌మాత్ వెంటనే లేచి హాల్లోకి వెళ్ళాడు. ఆ సార్జంటు శాల్యూట్ చేసి - "మీరు చెప్పిన నెంబర్లో తిరకాసేమున్నా ఉందా సార్?" అన్నాడు.

"ఏం?" అన్నాడు డిటెక్టివ్ చిరాగ్గా!

"A 17164 నెంబరున్నది మీ కారే సార్!"

[ఇంకా వుంది]

బట్టలకొట్టులో రాత్రివేళ ఇద్దరు దొంగలు పడ్డారు. కొంచెం ఖరీదైన బట్టలన్నీ మూటకట్టి చంకన పెట్టుకున్నారు. ఇంతలో ఒకడు కెవ్వమన్నాడు. ఏమి టేమిటని రెండోవాడు అడిగాడు.

"ఇదిగో ఈ చీరె చూడు. మామూలు చవకబారు నేత చీరె. దీని ఖరీదు వంద రూపాయలని చీటీఅంటించాడు షాపువాడు. ఇంతకంటె పచ్చిదొంగతనం ఇంకెక్కడన్నా ఉందా?" అన్నాడు మొదటివాడు.

# కవిసమ్రాట్ విశ్వనాథ షష్టిపూర్తి



60 ఎడ్లజతలు పూన్చిన శకటంపై గుడివాడపౌరులు కవిసమ్రాట్టును ఊరేగించి గౌరవించారు.

కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కిటీవల గుడివాడ పౌరులు జరిపిన షష్టిపూర్తి సన్మానోత్సవంలో యావదాంధ్ర నవ్య సాహిత్యోద్యమానికే ఒక సముగ్రమైన షష్టిపూర్తి జరిగింది.

విశ్వనాథ కవిగా, కథకులుగా, నవలా రచయితగా వ్యాసకర్తగా, విమర్శకులుగా విశాలాంధ్రలో ఉత్తమోత్తమ ప్రశస్తికీ, మన్ననకు పాత్రులయినారు ఇంకా అయన వైదుష్యానికి భాష్యాలు రచించగల విద్వాంసులను వేళ్ళతో లెక్కించ వచ్చును!

ఏ రే వాఙ్మయ శాఖ చేపట్టినా దానిలో వైవిధ్యము, బాహుళ్యము, గాంభీర్యము మొదలైన ఉత్తమ సారస్వత ధర్మాలుట్టి పడుతూ ఉరకలు వేస్తాయి!

విశ్వనాథ వారి రచనలలో గద్యంగాని పద్యంగాని ఏది పట్టిచూచినా దానిలో అనితర సాధారణమైన ఒక ప్రత్యేక వైయక్తిక ముద్ర, ప్రతిభ ప్రతిభాసిస్తాయి.

కవితలో వీరు గేయాలు, కథా కావ్యాలు, ఖండికలు మొదలుకొని మహాకావ్యం వరకు వివిధ శాఖలలో ప్రశస్త కృషిచేసి సువర్ణఫల కృషీవలు లైనారు!

శ్రీ సత్యనారాయణ గారికి నిత్య లక్ష్యాన్వితమైన సునిశిత దృష్టి సహజంగానే లభించింది. ప్రాచీన భారతీయ జాతీయత, అనాదానమైన ఆ సంప్రదాయగీత నేటిపాశ్చాత్య మహత్త్వ ఘోషలో పడి నశించిపోతున్నాయనే తహతహ, తపన—అవి పునరుజ్జీవింప జెయ్యాలనే తీవ్రమైన అభినివేశము, ఆత్మార్పణ వీరు రచించిన ప్రత్యక్షరం లోను ప్రత్యక్షమౌతాయి.

తెలుగుగడ్డ నల్లరేగటి పెళ్ళ పెల్లగించి పైకి వచ్చిన వీరి కృషిలో అధునాతనాంధ్ర సారస్వతానికి పట్టిన దుర్భిక్ష దోషమే మార దూరంగా తొలగిపోయింది!

మన దేశంలో వినూతనమైన పద్ధతులవలంబించిన సారస్వత పథికులు కోకొల్లలు! వారిలో చివరికి పెడదారులు తొక్కనివారూ చాలా తక్కువే!

విశ్వనాథవారి రచనా ఫణితి ఎక్కడా సంప్రదాయం శైలీ మెరుగులోపోలేదు. చాలాకాలంగా భావంలో, భాషలో బ్రిటిషు ల పరాధీనమైన ఆంధ్ర జాతికిది ఒక జీవనౌషధము నే భైషజ్యదృష్టి వీరి రచనలో అంతటా రసగుళికలా మెరుస్తుంది!

సువిశాలమయిన విశ్వనాథ కవన సాగరంతో సరితూగదగినది—ఆయన నవలారచన! ఈ దేశంలో సత్యనారాయణ గారి కావ్యగానవృష్టిలో తడియని వారుగాని—ఆయన రచించిన ఏదో ఒక నవలాసృష్టికి తనియని వారుగాని లేరంటే—అది న్యూనోక్తి మాత్రమే!

కవి సమ్రాటును పరీక్షగా పరిశీలించిన వారి కెవరికీ ఆయన ఈనాటి కాలం మనిషిలా కనిపించరు! వేషంలో, భాషలో సౌజన్యంలో, సహృదయతలో అయన మన లోకళ్ళ కట్టే రూపమే అట్టిది!

సత్యనారాయణగారి నసేవలు ప్రాచీన కవులతో పరిపోలుస్తూ ఉంటారు. నా దృష్టిలో ఆయన శ్రీకృష్ణదేవరాయలే ఇలా అవతరించారనీ, అంతరమైపోయిన ఆ ప్రాచీన సామ్రాజ్యం తిరిగి అక్షరరూపంలో నిర్మించుకొన్నారనీ అనిపిస్తుంది. నాటి సాహితీ పరులయెడల ఆయనచూపే ఆర్ద్రత, వర్తమాన కవిసమాదరణలో కనబరిచే ఆప్యాయత అనుభవించిన వారికి మొట్టమొదటగా స్ఫురించేదీ భావమే

విశ్వనాథ వాఙ్మయ వ్యాసంగం సమగ్రంగా పరిశీలించిన వారు చాలా అరుదుగా కనిపిస్తారు. వారి వాఙ్మయ వైశాల్యానికిది ఒక చిన్న తార్కాణ.

అయినా ఆయన ప్రతిభ నిత్యము ఒక నవీన సృజనా పరిధిలో పరిభ్రమిస్తూంటుంది. వయః పరిపాకంలో షష్టిపూర్తి జరిగినా భావనా తారుణ్యంలో ఆయనకింకా పదహారేళ్ళయినా నిండలేదేమో నని ఆశ్చర్యం వేస్తుంది!

ప్రజాసామాన్యం వారిని కవి సమ్రాడ్బిరుదంతో సత్కరించి అప్పుడే చాలాకాలం అయింది ఈనాడాయన మన యెదట సాహిత్య సమ్రాణ్మూర్తితో స్ఫురిస్తున్నారు!

దీనికి తగినట్టే త్వరలోనే విశాలాంధ్రావతరణం కూడా జరగబోతున్నది ఈ రెండు ఇంచుమించుగా ఒకేసారి సంభవించడం ఆంధ్ర సారస్వతానికొక సముజ్జ్వల శుభ సూచన!

—'శాస్త్రి'

# తాంబూలాలిచ్చేశారు

"నన్ను సినిమాకెవరెవరు తీసుకెళ్తారో చటుక్కున చేతు లెత్తండోయ్" అంటూ సుడిగాలిలా దూసుకువచ్చాడు సుబ్బారావు లవర్స్ డెన్‌లోకి. లవర్స్ డెన్ హాస్టల్‌లో మూడో నెంబరు గదికి ముద్దు పేరు. ఈ గది, హాస్టల్ కట్టిన నాటి నుంచీ భగ్నవీణలకీ, ఛిద్రహృదయాలకీ నిలయంగా ఉంటూవచ్చింది.

సుబ్బారావు దూకుడుగా వచ్చిన వేళకి, ఒక మజ్నూ భారీయెత్తున సిగరెట్లు కాలుస్తూ బాధపడుతున్నాడు. ఆ మజ్నూ ఇహలోక నామం రాజు. బాధపడుతున్న రాజుని చూస్తూ విచారపడుతున్న అప్పారావు మెల్లిగా తల ఎత్తి ఒక్కక్షణం చూసి, తల దించుకుని మళ్ళీ విచారపడడం మొదలు పెట్టాడు.

"కావలిస్తే నా డబ్బులు నేను పెట్టుకుంటా. మొత్తం ముప్పావలా ఉంది" అనేశాడు సుబ్బారావు తెగించి.

"ఏం సినిమారా. బతుకే ఓ సినిమాలా ఉంటే ఇంకా సినిమా ఏమిటి?" అన్నాడు రాజు తరఫున అప్పారావు.

"ఏమా కథ? సినిమా అయితే మరి సీతాఅమ్మవారెవరు? రాధణాసురు డెవడు? కేలంగి ఎక్కడ?"

"ఇంకా ఖరారుగా తెలీదుగదా. రాజు ఇవాళే ఊళ్లో దిగాడు. దిగీ దిగుతూనే, ఆ పిల్లని చూశాడు."

"ఏ పిల్లని?"

"ఏమో ఎవడికి తెలుసు? ఇవాళ ఆదివారంకదా? రేపు కాలేజి తెరిస్తే, వీడు రేపటిలోగా స్వర్గస్థుడయిపోకుండా కాలేజికి వస్తే, అక్కడ ఆ పిల్ల ఎవరో కనబడితే...ఆపైన తరువాయి కథ ఉంటుంది. ఆమె గాని ఏ థరుడు ఖారం ఆనర్సో అయితే, రహదారిమీద పడిగాపులు పడాల్సిందే" అన్నాడు అప్పారావు.

"నేను సస్పెన్సు భరించలేను. అసలే గుండె నీరసం వాణ్ణి. అందుకని నేను ఒక్కణ్ణే ఎలాగో అలా వెళ్ళి సినిమా చూసేస్తా. సాయంత్రం కథ చెబుతా లెండి. ఇంతకీ పేరు లేకపోతే మానే, అసలా సీతామ్మ లైలా స్వరూపం ఏమిటో కాస్త చెబుదూ రాజూ" అన్నాడు సుబ్బారావు.

"అబ్బ వాడసలే ఒఖలా మథనపడుతూ ఉంటే, నువ్వు మరింత రెచ్చగొడతా వెంగుఖా. నే చెబుతాపట్టు. లాటిన్ దిల్లూ, ముక్కు పుడకలూ, ఒంటి పేట గొలుసులూ, ముఖమల్ జోళ్లు వీడు ఇవాళ చూసిన పిల్ల కోసమే ఉత్పత్తి చేస్తోందట ప్రపంచం. ఫియట్ కారు, ఈ అమ్మాయి ఆమె కాబోయే భర్తా—తిరగడానికే డిజైన్ చేశారట. మామూలు మనుషులకి ఆమె కళ్లు చింపిరి కళ్లలా కనబడతాయికాని, సౌందర్య దృష్టి ఉన్న వీడివంటి వాళ్ళకి, అందమైన కళ్లే నేవి ఉంటే అవే సుమా అని ప్రబోధిస్తుందట మనసు. ముక్కు పుడకలు పాత ఫ్యాషన్ అనుకునే వారంతా ఆ అమ్మాయి సన్నటి ముక్కుమీద చిన్న ఒంటిరాయి ముక్కు పుడకని చూశారంటే తమీమని అభిప్రాయాలు మార్చుకుంటారట. ఇది ప్రథమ తరంగం. రాజు దిగీ దిగగానే ఇచ్చిన ప్రారంభోపన్యాసం."

సుబ్బారావు ఈ తరంగం విన్నాడో లేదో కాని, కింద పడిఉన్న సీమ వెండి సిగరెట్ కేసుని స్వాధీన పరచుకున్నాడు. తన జేబులో సిగరెట్లన్నీ ఒక్కొక్కటి అందులో అతి జాగ్రత్తగా అమర్చాడు. ఇంకా కాళీ మిగిలి పోయింది.

నా దగ్గిర ఆట్టే డబ్బులు లేవు. ఇక్కడి సిగరెట్లు కొనిని తీసుకుంటానని ఒక చిన్న జనాంతిక ప్రకటనచేసి, అక్కడున్న రెండు పెట్టెలూ తెరిచి సీమ వెండి డబ్బా నింపేశాడు.

"ఊ రెండవ తరంగం అనక వింటాను గాని టైమైంది. మళ్లా వస్తా" అన్నాడు లేవబోతూ.

"బొత్తిగా ఇంత స్వార్థం అయితే ఎలాగోయ్. ఇవతల వీడు మతి భ్రష్టుడై ఇలా ఉంటే, దయా దాక్షిణ్యం లేకుండా సినిమాకి పోతానన డానికి మనసెలా ఒప్పింది అంట. పైగా ఆ సిగరెట్లు ఊడ్చేసుకు పోతే మేం ఎలా ఏడవడం?" అంటూ చిరాకు పడ్డాడు అప్పారావు.

"ఆఖరికి సిగరెట్లుకూడా లేకపోయాయే అని ఏడవండి జమిలిగా అయినా. మతీసుతీ లేకపోతే సరి. ఎవర్తినో చూసి చూడనట్టు చూసి, ఇలా బెంగెట్టుకోవడం సిల్లీగా లేదు? మీ నాన్నకి ఉత్తరం రాస్తానుండు రాజూ అప్పుడు తెలుస్తుంది"

"ఏడిశావు లేవోయ్ బోడి పెద్దరికం నువ్వూను. వాళ్ల నాన్నగారు మొన్ననే శాంక్షన్ చేసేశారుట - వీడు వరించిన అమ్మాయిని తెచ్చి పెళ్ళి చెయ్యడానికి. ఎటొచ్చీ, ఆయనతో సి. పార్వతి (బి. ఏ. సెకండియర్ మూడో దండయాత్రని పెళ్లి చేసుకుంటానని చెప్పి వచ్చేశాడు. ఆయన సరే ననేశాడుట" అన్నాడు అప్పారావు.

"మరింకేం? ఈ ఏడు పేమిటి?"

బాధపడుతున్న రాజు ఇంక సహించలేకపోయాడు.

"ఏడు పేముందిరా... నేను మాత్రం కలకన్నానేమిటి ప్రపంచంలో, ఇవాళ చూచిన అమ్మాయంత అందమైనవాళ్ళు... అసలు అందం కాదులే. అదేదో చెప్పలేం ఒక విధమైన వెలుగు - జ్యోతి..."

రాజు చెలికాడు ఈ అవస్థ చూడలేక, అనుకున్నాడు. "అయినా ఎందుకు రాజూ వీడికి చెబుతావు నీ బాధంతా? ఆర్చేవాడా తీర్చేవాడా" అంటూ.

"నేను ఆర్చేదీ తీర్చేది ఏం లేదు కాని, ఇప్పుడేం చేస్తారని అడిగానంతే" అన్నాడు సుబ్బారావు చిన్నబుచ్చుకుంటూ.

"చెయ్యడానికేముంది. రేపు ఈ కొత్త పిల్ల పేరు, పై విలాసం తెలియగానే, వాళ్ల నాన్నకి టెలిగ్రాం ఇచ్చేస్తాడు. చిన్న సవరణ ఉందనీ, మొన్న చెప్పిన పార్వతి బదులు ఇంకో సరస్వతిని పెళ్లాడ నిశ్చయించుకున్నాననీని. ప్రమాదం ఏముంది. పేరు మార్పేగా?" అన్నాడు అప్పారావు.

"మరే ప్రమాదం ఏముంది?" అన్నాడు సుబ్బారావు.

సోమవారం ఉదయం పది గంటలకి కథ చాలా ముందుకు వెళ్లిపోయింది.

రాజు చూసిన రామ పేరు సరోజినిట. పొద్దున రాజు, అప్పారావు కాలేజికి వెళ్ళే సరికి, ఆ పిల్ల కనబడింది.

"అదుగో ఆ అమ్మాయ్ రా" అన్నాడు. రాజు ఎగిరి గంతేసి, తూలి కిందపడబోతూ.

"హారినీ... ఆమె పేరు సైన్‌డౌన్, ఈ ఏడే చేరింది. ఏదీ వచ్చి వారం రోజులైపోయిందో లేదో నలుగురైదుగురు రోమియోలు అద్దరా బాదరా వరించేసి,

వరుసక్రమంలో దృక్పథాలు మార్చేసుకుని, చెంపలు వాయించేసుకున్నారు. కాలేజీ తెరవగానే నువ్వూ వచ్చివుంటే, అందరితో పాటే..." అన్నాడు అప్పారావు.

"ఛా. అలా అనకురా. నిన్న చూసినపుడే అనుకున్నాను పార్వతి ఈ అమ్మాయి కాలిగోటికి సాటి రాదని. పేరేమిటన్నావు?"

"సైన్ డౌన్ అని చెప్పాను. కలకత్తా మెయిలు మెడ్రాసు నించి వచ్చే వేళకి ఈవిడ కాలేజి రోడ్డులో నడుస్తూ ఉంటుంది. క్లాసులో నెంబరు 32 అనుకో. అసలు పేరు సరోజిని. ఇంట్లో సరూ అంటారు. రేపొద్దున్న పెళ్ళాడితే నువ్వూ..."

"ఛీపో" అన్నాడు రాజు సిగ్గుపడుతూ.

క్లాసులోకి వెళ్ళారిద్దరూ.

మొదటి గంట పూర్తికాగానే వరండాలోకి వచ్చేసరికి సుబ్బారావు కనబడ్డాడు. రాజు పిలిచాడు. దగ్గరికి రాగానే రాజూ అప్పారావు ఎడాపెడా నిల్చుని సుబ్బారావు తలకాయ వంక చూడసాగారు. రాజు ఈర్ష్యతో చూశాడు; అప్పారావు జాలిగా చూశాడు.

"ఏం అలా చూస్తున్నారు? అన్నాడు సుబ్బారావు బిక్క మొహం పెట్టి.

"పరిగెట్టు కెళిపోయి గుండు చేయించుకొచ్చెయ్. లేకపోతే సాయంత్రం హాస్టల్‌కి రాగానే చావగొడతా" అన్నాడు రాజు.

"నాకేం నీ మంచికే చెబుతున్నాం. అయినా, కాపోయినా, సినిమా హీరోలాగ నీకు ఉంగరాల జుట్టేమిటోయ్ భగవాన్లూ" అన్నాడు అప్పారావు.

"నా జుట్టు గోల నీకెందుకోయ్. హనుమాన్లూ. మా నాన్న, అమ్మ, బాబాయ్, పిన్ని, మావయ్యా, అక్కయ్యా, బామ్మ నీతో కలిపి ఎనమండుగురు నా క్రాపు గురించి సలహా ఇస్తారా? అయినా ఇప్పుడిది ఫ్యాషన్ కాదుగా" అన్నాడు సుబ్బారావు.

"కాకపోవడమేమిటి! నాకు తెలిసిన రహస్యం నలుగురికీ తెలిస్తే, సాయంత్రానికల్లా ఉంగరాల క్రాపింగే 1956 ఫ్యాషన్ అయి ఊరుకుంటుంది. సరోజకి నచ్చిందంటే మాటలతో పనికాదు" అన్నాడు కాస్త గొంతు తగ్గించి.

"అయ్యబాబోయ్. ఆ ఘాటీకి నా క్రాపింగు నచ్చిందేమిటి కొంపతీసి. ఇప్పుడేం దారి?"

"దారికేముంది దారి గోదారే. గబ గబ సెలూన్‌కి వెళ్ళు. అంటకత్తెర సాధ్యమైనంత వికృతంగా చెయ్యమను. కావలిస్తే ఓ పావలా ఎక్కువిస్తానని ఆశపెట్టు. అక్కణ్ణించి గోదారికెళ్లి నెత్తినిండా స్నానం చేసి దేవుడికో దణ్ణం పెట్టుకుని ఇంటికెళ్ళి పడుకో. లేకపోతే, ఘాటీ ప్రేమిస్తుంది. వరిస్తుంది. చూస్తూవుండగా పెళ్ళాడేస్తుంది. జాగర్త" అని హెచ్చరించాడు అప్పారావు.

రింగుల క్రాపింగు సుబ్బారావు, వెంటనే సెలవు పెట్టేసి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఇటు రాజుకూడా సెలవు పెట్టేసి, బజారుకెళ్లి తిరిగి తిరిగి, జుట్టుని ఉంగరాలు తిప్పే క్లిప్పులు కొనుక్కుని, హాస్టలు కెళ్ళి అవి పెట్టుకు తలకట్టుకు పడుకున్నాడు. సుబ్బారావును హడలకొట్టడం అంతా బాగానేవుంది కాని, దానికోసం సరోజని ఘాటీ గీటీ అంటూ అప్పారావు హేళనగా మాట్లాడడం నచ్చలేదు రాజుకి. చిరాకేసింది కూడా.

"నాలుగురోజులలో కాస్త ఉంగరాలు తిరిగితే, సరోజ సంగతి నాన్నకు రాసెయ్యవచ్చు" అనుకున్నాడు.

హాస్టల్ కుర్రాణ్ణి పిలిచి సెలవుచీటి రాసి పంపేశాడు కాలేజికి.

* * *

మధ్యాహ్నం ఇంటర్‌వెల్ వేళకి అప్పారావు రొప్పుకుంటూవచ్చాడు లవర్స్ డెన్‌కి.

"నీదుంపతెగా నీకేం మతి గినాపోయిందిట్రా ఏమిట్రా ఈ సెలవుచీటీ. ఇది లెక్చరర్ కంటబడితే ఇంకేమేనా ఉందా" "నౌకరు నాకంటబడి నాచేతికిచ్చాడు గాబట్టి సరిపోయింది" అంటూ గది అదిరేట్టు గావుకేకలు వేశాడు.

"పోరా నీకేం తెలుసు నా ఆవేదన... సరూకి ఉంగరాల జుట్టంటే ఇష్టమని తెలిసి తెలిసి ఈ జూలుతో ఎలా రమ్మన్నావురా? మొహంచెల్లద్దూ? నాలుగు రోజుల్లో రింగులొచ్చేస్తాయని షాపువాడు చెప్పాడు. అందుకని సెలవు పెట్టేశా" అన్నాడు రాజు క్లిప్పులు అదుముకుంటూ.

"అయితే ఈ గోలంతా అందులో రాసుకుంటార్రా చదివిచూడు."

రాజు ఆబాధతోనే విసుగ్గా తను రాసిన సెలవు చీటీ అందుకుని చదువుకుని ఐదంగుళాల ఎత్తుకి ఎగిరిపడ్డాడు.

ఉంగరాలు తిరగందే కాలేజికి రావడానికి మనస్కరించటంలేదు కాబట్టి,దయతో, తనకు ఐదురోజులు సెలవు ఇప్పించాలని ఆ సెలవు చీటీలో ఉంది.

"ఎవరూ చూడలేదు గదా కొంపతీసి... బుర్రెక్కడో పెట్టుకు రాసేశానుసుమీ... థాంక్స్...నయమే. నువు చూశావు గనక సరిపోయింది" అంటూ దాన్ని చింపేశాడు రాజు.

ఇంకో సెలవు చీటీరాయించి పట్టుకుపోయాడు అప్పారావు.

మధ్యాహ్నం మొదటిగంట పూర్తి అయీ అవగానే, అప్పారావు సైకిలెక్కి మళ్లా వచ్చాడు హాస్టలుకి.

"ఒరేయ్ రాజూ! సుబ్బిగాడి జుట్టు నెరిసినా సరోజకి ఇష్టమేటరోయ్. తెలివితేటలు - అనగా విజ్ఞానం ఎక్కువ అయితే నీఅసలు జుట్టు నెరుస్తుందని అంచేత సుబ్బిగాడు పోతపోసిన విజ్ఞాని అనీ సరోజ అభిప్రాయం. ఇది తాజావార్త" అని చెప్పేసి చక్కాపోయాడు.

జుట్టు నెరవడం ఎలా అన్న సమస్య పట్టుకుంది రాజుని.

సబ్బుతో తలరుద్దుకొన్నా, ఓ పావలా తేసెకొని పులుముకున్నా, జుట్టు నెరుస్తుందని జ్ఞాపకంవచ్చింది. కొంపతీసి ముగ్గుబుట్ట అయి ఊరుకుంటేనో? పాయింటే. అందువల్ల అక్కడక్కడ అందంగా నెరవాలి. మానసిక వేదనవల్ల, అప్పులు, ఇంట్లో ఆవాలు మెంతులు నిండుకొనుట మొదలైన బెంగలవల్ల జుట్టు క్రమబద్ధంగా నెరుస్తుంది. విజ్ఞానం వల్ల కూడా నెరిసేమాట నిజమేకాని అది కణ్ణించి వస్తుంది?

"జ్ఞానం లేదా గాడిదా?" అని నాన్నగారు తిట్టేవారు. జ్ఞానమే లేనివాడికి, 'విజ్ఞానం' ఎక్కణ్ణించివస్తుంది? ఈ పంథాలో సతమతం అవడం సాగించాడు రాజు.

* * *

కొత్తగా పోలీసు అయిన ఒక ఆసామి, ఒగురుస్తూ ఠాణాలోకి వచ్చాడు.

"పార్కుదగ్గిర, ఎవరో ఒక ఆయన్ని తన్నిదోచుకున్నారండి. ఇక్కడికి తీసుకొచ్చా" అన్నాడు ఇన్‌స్పెక్టరుతో.

"ఎవడువాడు పాత మొహమేనా?

పోలీసు: దొంగ ఇంకా దొరకలేదండి. తన్నులు తిన్న ఆసామిని పట్టుకున్నానండి.

సాయంత్రం కాలేజీ వదలగానే రివ్వున వచ్చాడు అప్పారావు ఇంకో బులెటిన్ పట్టుకుని. రాజా అడగబోతున్న ప్రశ్న అప్పారావు అడిగేశాడు.

"ఏం బ్రదర్. నీకు జనరల్ నాలెడ్జి ఉందా? చాలా అర్జెంటు. బోలెడుంటే సరోజ నీది. లేకపోతే, సుబ్బిగాడు సరోజ వాడు" అన్నాడు.

"నేనూ అదే చూస్తున్నాను. విజ్ఞానం ఉంటే జుట్టు నెరుస్తుంది. ఎలా చెప్ప దంపాయించడం?"

"అయినా చూదాం ఉండు, అంజలి నాగేశ్వరరావూ, నటించిన—ఏమిాస్ విడి విడిగా-మొదటి సినిమాలు ఏమి? వారిద్దరు కలసి నటించిన మొదటి చిత్రం ఏది?

రాజు తడుముకోకుండా చెప్పేశాడు.

"మధుబాల దిలీప్ కలసినటించిన లేటెస్ట్ పిక్చర్ ఏమిటి?"

ఇదిగూడా రాస్‌మని చెప్పేశాడు రాజు.

"హారినీ ఇంత విజ్ఞానం ఉండికూడా ఇంకా జుట్టు నెరవకపోవడం ఏమిట్రా నీకు? ఇదేదో చిత్రంగా ఉందే?"

"పోదూ. నువ్విలా అంటావు కానీ, నీకూడా ఇవన్నీ తెలుసుకదా. నీకు మాత్రం నెరవడం లేదేం...

"ఇదికాదేమో విజ్ఞానం. పోనీ సైన్‌డౌన్ టెనప్, తర్టీటూ అంటే అర్థాలు చెప్పు."

"సైన్‌డౌన్ అంటే సరోజ టెనప్ అంటే సీతాలక్ష్మి. సరే తర్టీటూ మన ప్రొఫెసరు గారమ్మాయి సుందరి" అన్నాడు రాజు.

అప్పారావు విరగబడి నవ్వాడు. "ఓరి అమాయకుడా. సైన్‌డౌన్ అంటే కలకత్తా మెయిలు. టెనప్ అంటే ఇంకేదో రైలు తర్టీటూ అంటే పూరీ పాసింజరూను. సరే ఏదో తిప్పలు పడు!"

"రైల్వే గైడుకొని చదివేస్తే?"

"నీ బొంద రైలు సంగతులు మాత్రం తెలిస్తే ఏం లాభం. మిగతావో"

"మరెలాగ?"

"ఏమో"

*    *    *

మర్నాడు ప్రొద్దున్న కాలేజీకి వెళ్ళగానే ఒక న్యూస్ బులెటన్ పంపించాడు అప్పారావు.

"రాజా రాజా. సుబ్బిగాడు అంటకత్తెర మొహంతోనే కాలేజికి వచ్చేశాడు. ఇంకా రింగ్‌లు పోలేదుకాని, జుట్టంతా ఆరంగుళం మేకుల్లా ఉంది. అయితేనేం వెధవ బావున్నాడురా హాలీవుడ్ హీరోలా—దాదాపు క్లార్క్ గేబుల్‌లా తయారయ్యాడురా. అయినా, ఈ వెధవకి చదువంటే బొత్తిగా ఇంత శ్రద్ధాభక్తులు యెందుకో నాకు బోధపడలేదు. నీకు మళ్లే నాలుగు రోజులు సెలవు పెట్టుండాల్సింది

ఇట్లు, అప్పారావు.

పి. యస్:—సరోజ ఫస్టు పీరియడ్‌లో వాడి వంక మూడుసార్లు సూటిగా చూసింది—సారీ. అ. రావు.

రెండవ గంట కాగానే ఇంకో బులెటిన్ వచ్చింది.

"రాజా ఇది నీకు తెలుసా? రైలు సేషనులో ఉత్తరపుణ్యానికి ఇనపరేకుల తోరణాలలాటివి పట్టాలకడ్డంగా కట్టిఉంటాయి. అవి ఎందుకో తెలుసా?—ఇట్లు అప్పారావు

పి. ఎస్:—సరోజకి తెలుసుట! అ॥ రావు.

లంచ్ ఇంటర్‌వెల్‌లో అప్పారావు వచ్చీ రాగానే అడిగాడు "ఏం రాజా. తెలిసిందా జవాబు?" అని.

"ఊహుం...నీకు?"

"నాకూ తెలీదు. పైగా సుబ్బిగాడికి తెలుసుట. ఇదే కాదు. వాడికి చిల్లర విషయాలు కొల్లలుగా తెలుసుట. ఈ సంగతి సరోజకి తెలుసుట."

"సాయంత్రం కేకేసుకురారా వాణ్ణి" అన్నాడు రాజు.

"ఎవర్నీ? నన్నేనా?" అంటూ సుబ్బారావు ప్రవేశించాడు దూకుడుగా.

"వెదకబోయిన తీగా! వెయ్యేళ్లు బతుకు. కాని, నీకి అడ్డమైన సంగతులూ ఎలా తెలుస్తాయిరా?" అన్నాడు రాజా.

"ఇప్పుడు మళ్ళీ ఏం జరిగింది? ఆ పిల్ల..."

"మరే ఆ పిల్లకి ఉంగరాల క్రాపింగు నెరిసిన జుట్టు అంటే ఇష్టం. పైగా నీకు లోకంలో తెలీని సంగతులు లేవనీ, నువు మహామంచివాడివనీ ఆ పిల్ల నమ్మకం నాకేం" అన్నాడు అప్పారావు.

"చిత్రంగా ఉందే. నా చరిత్ర అంతా ఎలా తెలుసుకుందో" అన్నాడు సుబ్బారావు.

"అదేమిటి? భయపడ్డం మానేశావా? ఆ పిల్ల నిన్ను పెళ్ళాడుతుందని భయంలేదు?"

"భయం ఎందుకు? అంతగా బెదిరిస్తే అక్కర్లేదని ఖచ్చితంగా చెప్పేస్తా...... ఎటొచ్చి..."

"సరేగాని, నీ రహస్యం చెప్పు. నీకు చిన్న చిన్న విషయాలు, చిల్లర విషయాలు అశోకుడేం చేశాడో, నీళ్ళలో ఇనపముక్క మునిగితే కర్ర ఎందుకు తేలుతుందో, ఇండియా ఆఖరి గవర్నరుజనరలు ఎవడో— ఇలాటి వెలా తెలుసు?"

"ఆ. దానికేముంది. మాతమ్ముడికి రోజూ రెండు పూటలా పాఠం చెప్పకపోతే, మా నాన్నగారు డొక్క చీల్చేస్తానని చెప్పారు. అందుకని, పాఠం చెబుతూఉంటే, ఇవన్నీ తెలుస్తున్నాయి" అన్నాడు సుబ్బారావు.

"రైటో, నువు తక్షణం వెళ్లిపో," అన్నాడు రాజా.

*    *    *

ఆ సాయంత్రమే, వాకబుచేసి, ఫస్టుఫారం చదువుతున్న తమ్ముడు గల ఒక అన్నయ్యని మంచిచేసుకున్నారు. ఆ అబ్బాయిదగ్గిర ట్యూషన్ చెప్పించుకుంటూ న్నాడు రాజా.



"వాఙ్మయ మహాధ్యక్ష" బిరుదముతో ఇటీవల కోపల్లెలో పండిత సత్కారంపొందిన శ్రీ పద్లమూడి గోపాలకృష్ణయ్య.

## వక్తలూ, శ్రోతలూ

పెళ్ళికిముందు, అతడు అనర్గళంగా మాట్లాడేవాడు; ఆమె ఆలకించేది.

పెళ్ళయిన కొత్తలో, ఆమె మాట్లాడేది. అతడు వింటూ ఉండేవాడు.

రెణ్ణెల్ల తరువాత ఇద్దరూ ఒక్కసారే మాట్లాడేవారు. అప్పుడు ఇరుగుపొరుగులు ఆలకించేవారు.

# ★ తాంబూలాలిచ్చేశారు ★

"శుక్ర వెధవ దగ్గర నువు ట్యూషన్ చెప్పించుకోవడమేమిటి? సిల్లీ." అన్నాడు మిత్రుడు.

రాజు గంభీరంగా నవ్వాడు. "ఇంద్రుడి వజ్రాయుధం దేంతో చేశారు.?"

"వజ్రంతో."

"మాశావా. అది తప్పట."

"నువ్వు చెప్పు చూదాం." అన్నాడు స్నేహితుడు.

"నాకు తెలీదు మా తమ్ముడిని అడుగుదాం."

ఎముకతో చేశారు అని తమ్ముడు చెప్పాడు కాని రాజుకి కూడా నమ్మకం కుదర లేదు.

"ఎవరి ఎముకలు?" అని అడిగాడు.

"శిబీచి అనేవాడు ఇచ్చాడు."

"కర్ణుడు కాదా?..." అన్నాడు రాజు.

"కాదురా. బలి అయి ఉండొచ్చు."

"అబ్బే శిబిచే మా వాచకంలో ఉంది" అని నొక్కి చెప్పాడు చిన్న కుర్రాడు.

సైకో అనేసి, ట్యూషన్ ఏర్పాటు చేసుకున్నాడు రాజు. రెండు పూటలూ ఆ కుర్రాణ్ణి ఆ కాఫీ హోటలుకి అక్కణ్ణించి, హోస్టలుకీ తీసుకెళ్ళడం, పాఠాలు నేర్పినట్టు నేర్పుతూనే వాటని తనే నేర్చుకోవడం సాగించాడు. బుధ, గురు వారాలు హోరాహోరీగా చదువు సాగింది. మరో పక్క క్రాపింగుకు రింగులు తిరుగుతున్న ఛాయలు కనబడ్డాయి.

కాలేజిలో అంతా రాజు గురించి, అతని రింగుల క్రాపింగు గురించి, ఖాళీ ఉన్నపుడల్లా కబుర్లు చెప్పుకుంటున్నారు. రింగులు తిరుగుతాయా తిరగవా అన్న విషయంమీద కొందరు పందెం అనుకుంటున్నారు. కొందరు హోస్టలుకి వెళ్ళి రాజుని పరామర్శ చేస్తూ వచ్చారు.

* * *

శుక్రవారం సాయంత్రం రాజు చిరాగ్గా పచార్లు చేస్తూ ఉండగా, గురుతుల్యుడైన శిష్య పరమాణువు వచ్చాడు.

"నా తెలుగు వాచకం దొరికిందండి. శిబి పాఠం చదివానండి మరండి నిన్న మీరు చెప్పింది తప్పండి. శిబి చక్రవర్తిని డేగ తినెయ్యలేదుట. తినెయ్యి కావలిస్తే అని శిబి ఊరికేనే అన్నాడు. అప్పుడేమో డేగ ఇంద్రుడై పోయి..."

"ఒద్దు లేవోయ్ ఆపెయ్. నాకా కథ అక్కర్లేదు. నాదేతప్పులే" అన్నాడు రాజు విసుగ్గా.

"పోనీ తెలుగు ఒద్దు లెండి...జాగఫ్రీ కూడా మీరు చెప్పిందితప్పండి...కొన్నూరు కంది పప్పుకి ప్రసిద్ధి కెక్కిందిట..."

"ఇదిగో అబ్బాయ్, కొన్నూరు సంగతి నాకు తెలీదు కాని, ఇండియన్ ఆర్చిపిలగోలో పేము బాగా పండుతుందని నాకు బాగా తెలుసు, పేకబెత్తాలు మన వూళ్ళోకి దిగుమతి అయ్యాయి కూడా. నువు వెంటనే ఇంటికెళ్ళకపోతే పేకావారమ్మాయి నిచ్చి పెళ్లి చేస్తా..." అన్నాడు రాజు మహాకోపంగా. శిష్యుడు తెలుగు వాచకం అక్కడే పడేసి, ఇంటికి పరిగెత్తాడు.

అంతలోనే అప్పారావు రొప్పుతూ రోజుతూ వచ్చాడు.

"అబ్బాయ్ రాజూ. తాంబూలాలిచ్చేసుకున్నారుట తెన్నుకుచావు. నాకు నిజంగా బాధగా ఉందనుకో. కథ అడ్డం తిరిగిపోయి పెడదారిన చాలా దూరం వెళ్లి పోయింది. సారీ" అన్నాడు ఒగురుస్తూ.

"ఎవరిగోలా నువ్వు చెప్పేదీ?" అన్నాడు రాజు చాలా తాపీగా, నిశ్చలంగా, నిబ్బరంగా.

"అదే అదే. నీ...ఐమీన్...సరోజ... ఆ అమ్మాయికి సుబ్బిగాణ్ణిచ్చి పెళ్ళి చెయ్యడానికి వాళ్ళవాళ్ళ నాన్నగార్లు, పెద్దలూ నిశ్చయించేసి తాంబూలాలిచ్చేసుకున్నారు. వాళ్లు వాళ్లు దూరపు చుట్టాలుట. అసలు బంధుత్వం ఎలా ఏడిసినా, ఈ పిల్ల పెళ్ళి చేస్తారా చస్తారా అని పాతం వేసుకు కూర్చుందిట. మన వెధవ ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. అయినా కాపోయినా తండ్రి ఎడల ఎంత భయ భక్తులున్నా మరీ ఇంతా..."

"ఎవరూ నువు చెప్పేది సరోజిని సంగతా? ఆ పిల్ల సుబ్బారావుని పెళ్లాడితే వచ్చిన ముప్పేమిటి?" అన్నాడు రాజు తాపీగా.

"హోరి పిడుగా, ఆదివారం పొద్దుట్నుంచి ఇవాళ మధ్యాహ్నంవరకు నువుతపసోపాలు పడి నా మతి పోగొట్టిందెవరి కోసంరా?... నువు ఆమెని ప్రేమించ లేదు?" అన్నాడు అప్పారావు ఆశ్చర్యంగా కుర్చీలో కూర్చుంటూ."

"నాన్సెన్స్. మా నాన్న నాకు వేరే సంబంధం చూశాడు. నేను చూడక పోతే నేం. ఆయన ఎన్నిక చేసిన పిల్ల బాగుంటుందని నాకు గట్టినమ్మకం ఉంది."

కుర్చీలో కూర్చున్న అప్పారావుకి, పక్కనే ఉన్న బల్లమీద ఓ ఉత్తరంలాటిది కనబడింది. రాజుమాటలు వింటూనే చదివాడు...

"తాంబూలాలు ఇచ్చుకున్నాము... ఈ సంబంధం కనక...డొక్క వాలికలు చేసేస్తాను...వె...వేషాలు వెయ్యక...టనే రావలెను.

ఇట్లు జగన్నాథము" అని కనబడింది.

పచార్లు చేస్తున్న రాజు ఇంకా ఏదో చెప్పబోతున్నాడు. "అసలు అదీ కాక..."

"మరే మరే నీకొక్కవలసిందేదో నీకే తెలీదనుకో...అసలది కాక, సరూని నువ్వు చూసింది రెండు సార్లేగా. పైగా ఎడతెగని పితృభక్తోటి...." అన్నాడు అప్పారావు హేళనగా. ★

—'రవణ'

అణా కాసు పోయిందని ఏడుస్తున్న ఓ కుర్రాణ్ణి చూసి దారినపోయే ఒక పెద్దమనిషి, ఓదార్చి ఓ అణా ఇచ్చాడు.

అరగంట తరవాత ఆయన మళ్లా ఆ దారిన పోతూఉంటే కుర్రాడు అక్కడే వెతుకుతూ ఏడుస్తున్నాడు. "ఏం బాబూ మళ్లీ పారేసుకున్నావా?" అని అడిగాడాయన.

"కాదండి. ఇందాకటి అణా కాసు పారేసుకోకుండా ఉంటే ఇపుడు రెండు ఉండేవి గదా అని" అన్నాడు పిల్లవాడు.



ఈమధ్య బొంబాయిలో విడుదలైన పాకిస్థానీ చిత్రం "నసీ" లో పాకిస్థానీతార సబీహా.

ఎ. వి. ఎమ్. వారి "నాగులచవితి"లో ఒక సన్నివేశంలో జమున, మోహన్.

★ ★ ★

ప్రతిభావారి "ఏది నిజం" లో జానకి, జోగారావు, వంగర.



పీస్' నవలలో సృష్టించిన 'నటాషా'కు విశిష్టస్థానం సంపాదించుకుంది.

ఈ భూమిక నిర్వహించడానికి అర్హతగల నటీమణులు, బహు అరుదు. రెండే రెండు చిత్రాలలో నటించి, తారాపథాన్నందుకున్న బ్రిటిష్‌నటి ఆడ్రే హెప్‌బర్న్ మాత్రం ఈ భూమికకు అన్నివిధాలా సరిపోతుందనిపిస్తుంది. 50 లక్షల డాలర్ల ఖర్చుతో 'వార్ అండ్ పీస్'ను సెల్యులాయిడ్ మీదకు ఎక్కిస్తున్న ఇటాలియన్ నిర్మాతలు, దర్శకుడు కింగ్ విడార్, ఆడ్రీని ఈ భూమికకు తీసుకున్నారు.

ఎ. వి. ఎమ్. వారి
"నాగులచవితి" లో
జానకి.



దేశ్ చిత్రావారు గేవాకలర్‌లో నిర్మిస్తున్న "నిర్వాణ" హిందీ చిత్రంలో వైజయంతీమాల.
ఈ చిత్రంలో ఈమె నర్తకి వాసవదత్తగా నటిస్తున్నది. చిత్రం నిర్మాత దివాన్ షారర్.

నరూ్సావారి "కిస్మత్"లో రేలంగి, సీత.

★ ★ ★

గోకుల్ పిక్చర్సవారి "కనక తార" లో మల్లిక, అమర్ నాథ్.



ఫాక్స్‌కంపెనీవారి "సెవెన్ ఇయర్ ఇచ్" లో హాలివుడ్ తార మేరిలిన్ మన్రో.

# బొంబాయి సినిమా లేఖ



కల్పనా కార్తిక్.

## కల్పనా కథ

ఐరిస్ పార్క్ (జూహూ) సమీపంలో అందమైన గార్డెన్ ఒకటి ఉంది. అందులో చిన్న బంగళా ఉంది. ఆ బంగళాలో, అందమైన జంట ఒకటి ఉంది. ఆ జంటలో అమ్మాయి పేరు కల్పనా కార్తిక్. ఆ అమ్మాయి కర్ణాభరణాలు, జిప్సీలు పెట్టుకునే పెదపెద్ద కొమ్ముద్రికలా ఉంటాయి చూసీచూడగానే అవే కొట్టొచ్చినట్టు కనబడతాయి. వాటితో పోటీ వేసుకున్నట్టు ఆకర్షించేవి విశాలమైన నేత్రాలు. నల్లగా ఉంటాయి. ఆ జిప్సీ రింగులు చూస్తే దేశాటనం, నిలచిన చోట నిలవకుండా తిరగడం ఇష్టం అనిపిస్తుంది. కల్పనకి, నిజంగా దేశాటనం చాలా ఇష్టం తెరతారగా పేరొందడానికి పూర్వం, కల్పన ఒకసారి బొంబాయిలో బాంద్రా నించి, చర్చిగేట్ వరకూ 15 మైళ్ళ దూరం కాలినడకన తిరిగింది. ఎందుకు ? అంటే బొంబాయి చూడడానికి అంటుంది ఇపుడయితే, తెరతార కాబట్టి స్వేచ్ఛగా, షికారు వెళ్ళడం కష్టం అనుకునే, ఈమధ్య యూరప్ పర్యటనకి వెళ్లానంటుంది కల్పన. ఆమె, దేవానంద్ కలసి యూరప్‌లో, చూడదగ్గ దేశాలన్నిటికి వెళ్లి వచ్చారు.

చదువుకొంటున్న రోజులలో కూడా కల్పన ఇంతే. అప్పుడు ఆమె పేరు మోనా సింగా. దేశం విభజించబడడంతో, పాకిస్థాన్ నించి, మోనా, ఆమె ఐగురు సోదరులు, ఇద్దరక్కచెల్లెళ్లు వలస వచ్చేశారు. అప్పట్లో వాళ్లు సిమ్లాలో ఉండేవారు. అపుడు కల్పన నాటకాలు వేస్తాననీ, పర్వతారోహణ నేర్చుకుంటాననీ పోరేది. పోరి సాధించేది.

ఒకరోజున కల్పన, షికారు వెళ్ళింది. దర్శక నిర్మాత రూప్ కె. షోరి అక్కడ ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రించడానికి తమ బృందంతో వచ్చారు తారాపథంలో ఈ నల్లకళ్ల అమ్మాయికి మంచి భవిష్యత్తు ఉంటుందని షోరీకి తోచింది ఆ సంగతే చెప్పారు.

కల్పన వెంటనే జవాబు చెప్పలేదు. ఇంటికివెళ్ళి, అన్నలతో చెప్పింది. ఆ రోజునే, సుప్రసిద్ధ దర్శకుడు చేతన్ ఆనంద్ వాళ్ళింటికి వచ్చారు. "చేతన్ అంటే... దేవానంద్ అనే ఆయనకి అన్నయ్య కదూ?" అంటే, "అదీ అదే...చేతన్ భార్య ఉమ నా తోటికోడలు" అంటుంది కల్పన కొంటెగా నవ్వుతూ.



జూపిటర్ వారు నిర్మిస్తున్న "ఉమాసుందరి" లో నాగయ్య, శ్రీరంజని, కన్నాంబ.

## ★ బొంబాయి సినిమాలేఖ ★

ఆ రోజున చేతన్ ఆనంద్‌తో సంప్రదించగా ఆయన మంచిదని సలహా ఇచ్చాడు. సలహా యిచ్చి వెళ్ళిపోయిండా, కల్పనను బొంబాయి తీసుకెళ్లాడు.

తొలిసారిగా నవకేతన్ వారి 'బాజీ'లో, దేవానంద్ ప్రియురాలుగా నటించి, వెండితెర కెక్కింది కల్పన. తరువాత మూడు చిత్రాలు - అంధియాన్, హంసఫర్, టాక్సీ డ్రైవర్‌లలో కూడా ఆమె దేవానంద్‌తోనే నటించింది. ఆ చిత్రం తయారవుతూ ఉండగా, ఒక శుభముహూర్తాన దేవ్ కల్పనను పెళ్ళిచేసుకున్నాడు.

టాక్సీడ్రైవర్ విజయవంతం కావడంలో దేవానంద్ పేరుప్రతిష్ఠలు ఇనుమడించాయి. ఇటీవలి చిత్రం 'మునీంజీ' లో దేవానంద్ ప్రతిభావంతంగా నటించాడని అంతా ప్రశంసించారు. ఈ మధ్యనే దేవ్ మూడు కొత్త చిత్రాలలో బుక్ అయ్యాడు.

* * *

నాట్యతార వైజయంతిమాల, కొత్త కాలక్షేపం కల్పించుకుంది. ఇప్పుడామె, నటిస్తున్న చిత్రాలలో దక్షిణాది వేషభాషలకు సంబంధించిన సన్నివేశాలకు ఒకవిధంగా దర్శకురాలనవచ్చు. దాక్షిణాత్య ఆచార సంప్రదాయాలు, వేషధారణ, అలవాట్లు, కొన్ని కొన్ని చాదస్తాలు, సంభాషణల ఉచ్చారణ మొదలైనవి ఎలా ఉంటాయో సెట్స్‌మీద వైజయంతి వివరిస్తూఉంటుంది.

* * *

ఈమధ్య బొంబాయిలో రెండు కొత్త చిత్రాలు విడుదల అయ్యాయి. ఒకటి స్వర్గీయ కె. ఎల్. సైగల్ జీవితాన్ని చిత్రిస్తూ శ్రీ బి. ఎన్. సర్కార్ నిర్మించిన "అమర్ సైగల్" ఇందులో సైగల్ పాటలలో ఉత్తమోత్తమమైనవి 20 ఉన్నాయి దేశవ్యాప్తంగా ఈ చిత్రం బహుళ జనాదరణ పొందుతుందనడానికి సందేహం లేదు ఈ రూపేణా సైగల్‌ను సందర్శించడానికీ, ఆయన మధుర గానం వినడానికీ అవకాశం కలిగించిన శ్రీ సర్కార్ అభినందనీయులు.

రెండవది, నిరూపరాయ్, బల్‌రాజ్ సాహ్నీ, షమ్మీకపూర్, అనితాగుహ నటించిన "టాంగావాలీ." తరచుగా దేవతల భూమికలు నిర్వహించే నిరూపరాయ్, ఇందులో కొత్తరకంపాత్ర నిర్వహించింది. కథ ముఖ్‌రామ్‌శర్మ వ్రాశారు.

"(ఆంధ్రపత్రిక బొంబాయి విలేఖరి)

 

# సినిమా వార్తలు



## వార్ అండ్ పీస్

ప్రపంచ సారస్వతంలో సర్వేసర్వత్రా ఉత్తమోత్తమంగా ఎన్నిక అయే నవలల్లో టాల్‌స్టాయ్ వ్రాసిన 'వార్ అండ్ పీస్' ఒకటి.

ఇన్ని పాత్రలు, ఇన్ని సంఘటనలు గల నవలలు బహు తక్కువ.

ఒకానొక యుగాన్ని, ఉజ్వలంగా చిత్రించే ఇటువంటి నవలను, కుదించి, సెల్యులాయిడ్ మీదకు అనువదించబోవడం దుస్సాహసం అనిపిస్తుంది. ఇన్నాళ్ళూ ఏ ఒక్క నిర్మాతా ఇందుకు పూనుకోనక పోవడానికి కూడా ఇదే కారణం.

అయితే ఇప్పుడు డినోడి లారెంటీస్, కార్లోపాంటీ అనే ఇటాలియన్ నిర్మాతలిద్దరు సాహసించి దీనికి పూనుకొన్నారు. డబ్బుకీ, దక్షతకీ దేనికీ లోటు, ఇబ్బంది లేదు కాని వీరు ఎదుర్కొంటున్న పెద్ద కష్టం స్క్రిప్టు రచనే. దాదాపు 11 వందల పేజీలలో అచ్చుఅయిన, ఈ గాథని ఇప్పుడు రెండుగంటలలో చెప్పడానికి వీలుగా కుదించాలి. టాల్‌స్టాయ్ సృష్టించిన పాత్రలన్నిటినీ 12 వేల అడుగుల సెల్యులాయిడ్‌లో చిత్రించాలి.

ఇప్పటికి ఏడెనిమిది స్క్రిప్టులు వ్రాయబడ్డాయి. వాటిలో ఐదు స్క్రిప్టులు ఇటాలియన్‌లో వ్రాశారు. రెండు ఫ్రెంచి రచయితలవి. ఇవిఏమీ పనికిరావు పొమ్మన్నారు! ఆ తరవాత ఇద్దరు బ్రిటిష్ రచయితలు-బ్రిడ్జెట్ బోలెండ్, రాబర్ట్ వెస్టర్బీలకు ఒప్పగించారు.

రచన తప్పిస్తే మిగతా హంగులలో దేనికీ లోటు లేకుండా, నిర్విరామంగా కృషి చేస్తున్నారు.

## 50 లక్షల డాలర్ల ఖర్చు

సుప్రసిద్ధ అమెరికన్ డైరెక్టరు కింగ్ విడార్ దర్శకత్వాన విస్టావిజన్‌లో టెక్నికలర్ చిత్రంగా నిర్మించబడుతున్న దీని ఖర్చు ఏభైఅరవై లక్షల డాలర్ల వరకూ అంచనా వేశారు. నెపోలియన్ దండయాత్రల నాటి సైనికులు ధరించిన దుస్తులు, ఆ కాలంలో వాడబడిన ఆభరణాలూ, అలాగే వాహనాలూ భారీఎత్తున తయారు చేయిస్తున్నారు. బ్రహ్మాండమైన సెట్స్ వేస్తున్నారు. అన్నిటిలోకి పెద్దది మాస్కో సెట్. యుగోస్లావియాలో నిర్మించబడ్డ ఈ సెట్‌ను అసలుసెట్ అనలేము. 1812 నాటి మాస్కోని యథాతథంగా నిర్మించివేశారు.

## 60 మంది నటీనటులు

'వార్ అండ్ పీస్' నవలలో పాత్రలన్నీ-వెండి తెరమీద చూపాలని నిర్మాతల సంకల్పం. ముఖ్యపాత్రలు నిర్వహించడానికి ప్రముఖ నటీనటులు 60 మందిని బుక్ చేశారు. వీరుకాక, చిన్న వేషాలు వేసేవారు పదివేలమంది. పెద్ద నటీనటులలో హెన్రీ ఫాండా (ఇతని భూమిక మొదట గ్రెగరీ పెక్‌కు ఇవ్వాలనుకున్నారు), మెల్‌ఫెరర్, జాన్‌మిల్స్ పీటర్ ఉస్తినోవ్, విటోరియో గాస్‌మాన్, రోసానో బ్రాజీ, వాలెంటినా కార్టిసీ మొదలైనవాళ్లున్నారు.

## నటాషా భూమిక

ఇందుకే పుట్టిందా అనిపించే బ్రిటిష్ నటి ఆడ్రీ హెప్ బర్న్, ఈ చిత్రంలో అతిముఖ్యమైన పాత్రలలో ఒకటి అయిన నటాషా భూమికను నిర్వహిస్తోంది. రోమన్ హాలీడే తో తారాపథాన్నందుకున్న ఆడ్రీ, 'సబ్రీనా'తో సర్వే సర్వత్రా అభిమాన పాత్రురాలైంది. సమర్థురాలని ఋజువు చేసుకుంది. 'సబ్రీనా' తరవాత, ఆడ్రీ ఎందులోనూ నటించలేదు; మంచికథ లేనికారణంగా. ఇప్పుడు ఈమె, ఈమె భర్త మెల్ ఫెరర్ లు ఇద్దరూ 'వార్ ఎండ్ పీస్'లో ఉన్నారు. ఒక రష్యన్ సైనికాధికారిగా ఫెరర్ నటిస్తున్నాడు.

సుప్రసిద్ధ ఇటాలియన్ నటి సిల్వానో మంగానోకు నటాషా భూమిక ఇవ్వాలని, మొదట్లో నిర్మాతలు అనుకున్నారు. నిర్మాతలలో ఒకడైన లారెంటిస్ ఈమె భర్తే అయినా, దరిమిలా ఆలోచించి, ఆడ్రీని తీసుకోవడం జరిగింది.

'వార్ అండ్ పీస్' ఎప్పటికి పూర్తి అయ్యేటట్లు? 18 మాసాలు పడుతుందని మొదటఅంచనా వేశారు. 1957 లో ఎప్పుడో కావచ్చునని దరిమిలా అన్నారు.

హాలివుడ్ నిర్మాత డేవిడ్ సెల్జ్‌నిక్ కూడా ఈచిత్రం నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారనీ, అందువల్ల నిర్మాతలు, దర్శకుడు కింగ్ విడార్, దీని నిర్మాణం చాలా చురుకుగా సాగిస్తున్నారనీ, అందువల్ల ఈ సంవత్సరంలోనే పూర్తిచేసి విడుదల చేస్తారనీ రూఢిగా తెలిస్తోంది.



రాజమహేంద్రవరంలో ఇండియన్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ ఆధ్వర్యాన జరిగిన నాటక ప్రదర్శన పోటీలలో ఉత్తమ నటుడుగా ఎన్నికైన 'శ్రీనాథ్.' ఇతడు నాగేశ్వరరావు రజతపాత్రను, నాగయ్య సువర్ణపతకాన్నీ బహుమతులుగా అందుకున్నాడు. భీమవరం భవ్యలలితకళా సమితి ప్రదర్శించిన నాటకంలో 'శ్రీనాథ్' ముఖ్యభూమిక నిర్వహించాడు.

---

## డిమిల్ హిందీ చిత్రం

సిసిల్ బి. డిమిల్ దాదాపు పదేళ్ళ నాడు నిర్మించిన 'క్రూసేడ్స్' అనేచిత్రం హిందీలోకి డబ్ చేయబడింది. దీనికి 'సలీబీ జంగ్' అని పేరుపెట్టారు. హెన్రీ విల్కాక్సన్, లారెటా యంగ్ ఇందులో ప్రధానభూమికలు నిర్వహించారు. శ్రీ సదానంద్ దేశాయ్ డబ్బింగ్ నిర్వహించారు. పారమౌంట్ పిక్చర్స్ ఈచిత్రాన్ని త్వరలోనే విడుదలచేయడానికి సన్నాహాలు చేస్తున్నారు.

* • *

## 'ఏది నిజం' ఔట్‌డోర్ షూటింగ్

మద్రాసు శివారు గ్రామం విరియాంబాక్కంలో, ప్రతిభా పిక్చర్స్ బృందం జనవరి 18 నుండి 21 వరకూ 'ఏది నిజం' చిత్రంలో ఔట్‌డోర్ దృశ్యాలు షూట్ చేశారు. నాగభూషణం, జానకి, జోగారావు వీటిలో నటించారు. శ్రీ ఘంటసాల కృష్ణమూర్తి నిర్మిస్తున్న యీ చిత్రానికి శ్రీ బాలచందర్ దర్శకుడు ఫిబ్రవరి నెలాఖరు లోగా విడుదల చేయడానికై నిర్మాణం వేగంగా సాగిస్తున్నారు. అంతా కలిపి ఇంకో పది కాల్‌షీట్ల పని ఉంటుంది.



గాయకుడుగా, నటుడుగా ఒక దశాబ్దానికిపైగా సినిమా ప్రేక్షకులను ఉర్రూతలూగించి కీర్తిశేషుడైన కె. ఎల్. సైగల్ జీవిత చిత్రం "అమర్ సైగల్"లో సైగల్ గా నటించినకన్నడ నటుడు జి. ముఫేరీ, పహారీసన్యాల్.

# సినిమా వార్తలు

ముఖ్యమైన ఇండోర్ సెట్స్‌లో కోర్టు సెట్ ఒకటి. ఆదివారంనాడు ఫ్లోర్‌లో ఈ సెట్ మీద షూటింగ్ జరిగింది. తరువాతి రెండురోజులూ ఔట్‌డోర్ దృశ్యాలు తీశారు.

## "తెనాలి రామకృష్ణ"

తెలుగులో చారిత్రిక చిత్రాలు నిర్మించదలచిన వారికి కృష్ణదేవరాయల కాలం పెన్నిధి వంటిది. ఆంధ్రదేశ చరిత్రలో ఆ కాలం, ఆనాటి విజయనగర సామ్రాజ్యం అతి వైభవోజ్వలమయిన సువర్ణ ఘట్టాలు, సాహిత్య, సంగీత, శిల్పాది లలితకళలు ఉచ్ఛస్థితిలో ఉన్న కాలమది. ఆకాలాన్ని గూర్చి, ముఖ్యంగా రాయలవారి ఆస్థానాన్ని గూర్చి, పెద్దన మొదలయిన అష్టదిగ్గజాలనుగూర్చి ఓ లెడు కథలు తెలుగువాట ప్రచారంలో ఉన్నాయి. వీటన్నిటినీ సరిగా ఉపయోగించుకోగల నిర్మాతే ఉంటే ఎంత అద్భుతమయిన చిత్రమయినా తీయవచ్చు.

అప్పటి కవులందరిలోనూ, ప్రాసీన కావ్యాల మూలంగా కాకపోయినా కట్టు కథల ద్వారా ప్రతి తెలుగువాడికీ పరిచితుడయిన కవి తెనాలి రామకృష్ణుడు. ఈ కవిని గూర్చి ప్రచారంలో ఉన్న కథలను, కొంత చరిత్రను తీసుకొని, కొన్ని ఘట్టాలు కల్పించి విక్రమ్ ప్రొడక్షన్స్ వారు చిత్రం తీసి విడుదల చేశారు.

ఈ చిత్రంలో కవిగా నాగేశ్వరరావు, రాయలుగా ఎన్. టి. రామారావు, అప్పాజీగా నాగయ్య నటించారు. రామకృష్ణుని భార్యగా జమున, రాయలను వశపరచుకున్న వేశ్యగా భానుమతి నటించారు. ఇంకా ముక్కామల, వంగర, సురభి బాలసరస్వతి, సంధ్య, మిక్కిలినేని మున్నగువారు కూడా పాల్గొన్నారు. నిర్మాత, దర్శకుడు బి. ఎస్. రంగా. మాటలు, పాటలు సముద్రాల వారు రచించారు. సంగీతం విశ్వనాధన్, రామమూర్తి సమకూర్చారు.

తెనాలి రామకృష్ణుని పేర ప్రచారంలో ఉన్న చాటు పద్యాలను, కథలను, ఆధారం చేసుకొని సన్నివేశాలను కల్పించి నిర్మాతలు ఈ చిత్రంలో ఎక్కువభాగం నింపారు. యుక్తిచతురుడయిన చాటుకవిగానూ, రాయల సామ్రాజ్యాన్ని భామినీ సుల్తానుల నుండి రక్షించిన వెర్రిగాను ఆయనను చిత్రించడానికి, ఆ చిత్రణం పామరజన రంజకంగా ఉండేటట్లు నిర్మాతలు ఈచిత్రం తీశారు. వికటకవిగా కాక అనన్య ప్రతిభగల మహాకవిగా, పాండురంగ మాహాత్మ్య కర్తగా రామకృష్ణుని చూపడానికి నిర్మాతలు యత్నించలేదు. రాజకీయ చతురుడుగా ప్రసిద్ధిపొందిన తిమ్మరుసు పాత్ర, విలక్షణమయిన కవిత వ్రాసి తెలుగు సాహిత్యంలో ప్రత్యేకస్థానం సంపాదించుకున్న కృష్ణదేవరాయల పాత్రకూడా అసమగ్రంగానే ఉన్నట్లు తోస్తుంది.

ఈ చిత్రంలో పాటలు శ్రావ్యంగా ఉన్నాయి. ఘంటసాల పాడిన పద్యాలన్నీ చాలా హాయిగా ఉన్నాయి. నటీనటులందరూ చక్కగా నటించారు. ★




## తొమ్మిదో అధ్యాయం

సుశీలకి అన్నగారింట్లో మొదట్లో బాగానే నడిచింది. ఊళ్ళో వాళ్ళందరి రాకపోకలతో ఆమెకు ఊపిరి తిప్పుకోవడానికి కూడా తీరిక లేకపోయింది. ప్రతివారూ సానుభూతి వెళ్ళబుచ్చేవారే "అయ్యో తల్లీ, నీకే వచ్చాయా ఈ బాధలు" అనేవారే. వదినగారు కూడా ఎంతో మర్యాద చేసింది మొదటి మూడు రోజులూ రోజుకొక పిండివంట చేసి పెట్టింది. సుశీల మంచంమీదనుంచి దిగనక్కర్లేకుండా చూసింది సుశీలకలా కూర్చోవడం కష్టంగా నే తోచింది. కాని ఎంతో కాలమా మెకీ ఇబ్బంది లేకపోయింది. పిండివంట లేనాడో ఆగిపోయాయి కూర ఉంటే చారుండదు. చారుంటే కూర ఉండదిప్పుడు. సుశీలకు పని కూడా తగలసాగింది ఇప్పుడు. వదినగారు స్పష్టంగా పనిచేయమని చెప్పేది కాదు. సుశీలముందు చతికిలబడి "చచ్చిపోతున్నానమ్మా, ఈ చాకిరీతో, ఇంతమంది పిల్లలతో ఒక్కదాన్ని ఎలా చేయగలను చెప్పు. ఒక క్షణం విశ్రాంతికి నోచుకోలేదు గదా. నీవెలా చేసుకుంటున్నావో గాని పిల్లలతో బెజవాడలో!" అనేది. ఆ మాటలు వినగానే సుశీల "వదినా నీవు కాసేపు కూర్చో. నేను చేసి పెడ్తాను. నాకు బద్ధకం పెరిగిపోతోంది ఏ పనీ చేయక" అని లేచేది. వదినగారు "వద్దమ్మా, నీవు కూడా కష్టపడడ మెందుకు? అన్నగారి ఇంటికి వచ్చినప్పుడేనా సుఖంగా ఉండక. హాయిగా కూర్చోవమ్మా" అనేది కాని సుశీల వద్దు పెట్టేది కాదు. సుశీల పనులు చేసి పెట్టేది. క్రమంగా వదినగారు "ఏమమ్మా వదినా, నీవు కాస్త ఈ పని చేసి పెట్టావా నాకింకో పని ఉంది" అనేది. చివరికి ఫలానా పని చేయమని స్పష్టంగా చెప్పే వరకూ వచ్చింది. కూతురు చాకిరీ చేస్తూంటే తల్లి సహించలేక పోయేది. కోడలిని కోప పడేది. దానితో కోడలు పెద్ద బాధపడుతున్నట్టుగా ఏడుపుకంఠం తెచ్చుకొని "నేను చేయమన్నానా ఆ పని. ఆవిడే చేస్తానంది కాని. మీ కూతురంటే మీకే ఆపేక్ష అనుకుంటున్నారు. నాకు మాత్రం వదినగారన్న అభిమానం లేదూ? ఏవమ్మా, సుశీలమ్మా, నీవేంపనీ చేయకమ్మా. మీ అమ్మగారు నన్నంటున్నారు మధ్య. నేను చేసుకుంటానులే. నాకే మీ బాధలేదు ఎంతపని చేసినా నాకోసం బాధపడేవారు లేరుగా" అనేది. సుశీలే తల్లిని కోపపడి పని చేసేది. వదినగారు భారమైన పనులన్నీ సుశీలమీదే వేసి తప్పించుకు తిరుగుతోంది. తల్లి కూతురుకు సాయ పడదామని ప్రయత్నించింది కాని పెద్దతనం వస్తూండడం వల్ల ఆమె చేయగల సాయాలంతగా లేకపోతోంది.

సుశీల అప్పుడే నీళ్ళతోడే పని పూర్తి చేసుకుంది. అలసిపోయి ఉండడంవల్ల కాసేపు విశ్రాంతి తీసుకుందామని తాటాకు చాపమీదకు వాలింది. ఇంతలో రామమూర్తి "అమ్మాయీ, అమ్మాయీ" అని కేక వేస్తూ హడావుడిగా పరుగెత్తుకువచ్చాడు. సుశీల కంగారుగా లేచి నిలబడింది. తల్లి కూడా పరుగెత్తుకువచ్చింది. "ఏం నాయనా ఏం జరిగింది" అంటూ. "రఘు ఎక్కడికో వెళ్ళిపోయాడటమ్మా. సీతారామయ్యగారు రాశారు. పదిహేనురోజులపైన అయిందట. ఇంతవరకూ జాడలేదట మొదట్లో ఇక్కడికే వచ్చి ఉంటాడనుకున్నారట అందుకే ఇంతవరకు వ్రాయలేదట" అని ఉత్తరం చదివి వినిపించాడు రామమూర్తి. సుశీలకు మిన్ను విరిగి మీదపడినట్లయింది. అలాగే నేలమీదకు కూలిపోయింది. తల్లి పెదవుల మీద వేలు వేసుకుంటూ "ఎంత పని చేశాడు! అనుకున్నంతా చేశాడు గదా! ఇంకే ముంది ఆ ముండతో నే కలిసి ఎక్కడికో వెళ్ళిపోయి ఉంటాడు" అంది.

సుశీల అక్కడ ఉండలేక ప్రక్క గదిలోకి పోయి అక్కడ మంచంమీద బోరగిల పడి హృదయం పగిలినట్లు ఏడవసాగింది. ఆమెకు అంతా అంధకారమే అయినట్టుంది. ఇంత వరకూ తన భర్త తన నెప్పుడో తిరిగి ఆదరిస్తాడనే ఆశతో ఉంది. ఇప్పుడా ఆశ అంతరించి పోయింది. భర్త ఎక్కడికి వెళ్ళిపోయి ఉంటాడు? తల్లి అన్నట్లు ఆ పాపిష్ఠి దానితో కలిసి వెళ్ళిపోయి ఉంటాడా? ఈ ఆలోచనతో ఆమెలో అభిమానం రేగసాగింది. ఇంతలో ప్రక్క గదిలోనుంచి గుసగుసలు వినపడసాగాయి.

ఆమె వదినగారే అంటోంది: "ఇక ఈవిడగారిక్కడ స్థిరనివాసమేనన్నమాట!"

అన్నగారంటున్నాడు: "ఇలా జరుగుతుందని ఎవరనుకున్నారు? నాలుగు రోజుల్లో అతనే దారిలోకి వస్తాడనే ఉద్దేశ్యంతో మా చెల్లెలినీ వాళ్ళనూ తీసుకు వచ్చాను. తీరా ఇలా అయింది."

"ఇలా అవుతుందని నేను మొదటినుంచీ చెపుతూనే ఉన్నాను. ఒంటరిగా విడిచిపెడ్తే మరి ఏం జేస్తాడు అతను? మగాడు ఎలా ఉన్నా, మగాడితో సమానంగా ఆడది కూడా పంతం సాగిస్తానంటే ఎలా చెప్పండి. ఎలాగో భర్తదగ్గరే ఉండి చేతనైతే తనవైపుకు తిప్పుకోవాలి గాని, ఇలా లేచి రావడమేమిటి మీ చెల్లెలు—మీరు తీసుకురావడం మాత్రం ఏమిటి?"

ఈ మాటలు సుశీలహృదయంలో సూదుల్లా గుచ్చుకుంటున్నాయి. అయినా ఊపిరి బిగపట్టుకొని వింటోంది.

రామమూర్తి ప్రాధేయపూర్వకంగా అంటున్నాడు: "జరిగిందేదో జరిగింది. తెలిసో, తెలియకో తీసుకువచ్చాను. ఇప్పుడేం చేయమంటావు?"

"పోషించండి! పోషించడానికేగా తీసుకువచ్చారు. ఏ మాత్రం పోషిస్తారో చూస్తాను!"

"కాదే బాబూ. ఏవో రెండు వారా

యుంటుంది? మహా అయితే నెల ఉంటుంది రెండు నెల లుంటుందని తీసుకు వచ్చాను. కాని ఇలా ఎప్పుడూ ఇక్కడే ఉండవలసి వస్తుందని అనుకున్నానేమిటి? ఏదో దారి నీవే చెపుదూ?"

"ఏం దారి చెప్పనూ గోదారి! ఆ వెళ్ళే వాడేమైనా దిగబెట్టి వెళ్ళి ఉంటాడుగా బాంకులోనో ఇతర్రాతానో. ఏ మాత్రమో రాయలేదూ ఆ సీతారామయ్యగారెవరో?"

"రాయలేదు. ఆయనకు మాత్రం ఎలా తెలుస్తుంది. దిగబెట్టాడో లేదో?"

"బాంకులో కొంతేనా ఉండకుండా ఎలా ఉంటుందండీ? అంతా ఒక్కసారే ఎలా పట్టుకు పోగలడు. వెళ్ళి ఆ డబ్బు మీ చెల్లెలికి వచ్చే ఏర్పాటు చేయండి. ఆ డబ్బుతో కొంతకాలం ఈడవవచ్చు. ముగ్గురిని పోషించాలాయె. ఇక్కడ ఆస్తులేవీ పెన కాల పడి ఉండలేదు ఎంత కాలమైనా మెక్క బెడుతూ కూర్చోడానికి. అదీకాక, ఆశ్లే వేషాలు వేయక వెంటనే అతను ఇంటికి తిరిగి వచ్చే యత్నం చేయండి. పిల్లకో పిల్లాడికో జబ్బుగా ఉందని పేపర్లో వేస్తే అతనే వస్తాడు. ఈ లోపుగా ఈ డబ్బు కొంత సర్దవచ్చు."

"ఊఁ?—అవును—కాని మా చెల్లెలితో నే నెలా చెప్పగలను? నీవే చెపుదూ" అన్నాడు రామమూర్తి సందేహిస్తూ.

"చెప్పడానికి మాత్రం నేను కావాలీ! ఏం పడినా నేనే పడవచ్చునని కాదూ? అసలు ఇప్పటికే ఆడబిడ్డను కోసి పెట్టున్నావనీ, ఇంట్లోనుంచి వెళ్ళగొట్టడానికి ప్రయత్నం చేస్తున్నానినీ నానా మాటలూ ఆడిపోసుకుంటున్నారందరూ. ఇక ఈ మాట కూడా చెబితే ఇంకేమైనా ఉందా? ఆ డబ్బు కాజేయడానికి నాకు దుర్బుద్ధి పుట్టిందనరూ?"

రామమూర్తికి పౌరుషం పొంగుకు వచ్చింది. భార్య నెవళ్ళేనా ఏమన్నా అంటే



సహించలేడు. "ఎవరంటా ఆ మాట అన్నది? నా ముందుకు రమ్మను. నేను చెపుతాను జవాబు. నీమీద ఒక్కమాట రానీయి. వాళ్ళను ఏం చేస్తానో" అన్నాడతను పెంపుడుకుక్క పౌరుషంతో. "సరేలే నేనే చెబుతాను" అన్నాడు చివరికి.

సుశీల మనస్సనేక విధాల పోసాగింది. ఎన్ని విధాలాలోచించినా ఆమె అక్కసు 'ఆ కమల'మీదే. ఆ కమలే తన భర్తను చెడగొట్టడానికి ప్రయత్నం చేసింది కాని తన భర్త మాత్రం నిర్దోషి అనే తోచేది. తానతని ననవసరంగా అనుమానించింది. నిజంగానే తన భర్తకు తానూ హించిన దుర్బుద్ధి ఉండి ఉండదు. అందుకే ఆనాడు తనను వెళ్ళవద్దని చెప్పాడు. అతని మాట త్రోసివేసి రావలసింది కాదు తను. అతనెంత బాధపడ్డాడో! ఏ దురంతానికి సాహసించాడో నన్న ఆలోచన లామెను కలవరపరచసాగాయి. తన భర్తను తిరిగి రప్పించేందుకు వదినగారు సూచించిన ఉపాయం ఆమెకు చాలా బాధకలుగజేసింది. తనపిల్లలు క్షేమంగా ఉండగా జబ్బుగా ఉన్నారని రాయడమే! ఎంత అమంగళం! ఈ తలపుతో ఆమె గిజగిజ కొట్టుకుంది. తన పిల్లలకే కీడూ రాకూడదని భగవంతుణ్ణి ప్రార్థించింది. ఆమె ఇలా ఆందోళన పడుతూంటే "అవతల వదినగారి కేక వినిపించింది: అమ్మాయీ, అత్తయ్యను వంటచేయమను. నాకీవేళ తలనొప్పిగా ఉంది" ఆకేక విన్నదే తడవుగా సుశీల కంగారుగా లేచి పరుగెత్తుకు వెళ్లి వంట మొదలు పెట్టింది.

పాపా సుకుమార్‌లు అటు పరుగెత్తుకు వచ్చారు. "అమ్మా, అమ్మా మాకు చెరొక అణా ఇయ్యవమ్మా" అంటూ గోల మొదలు పెట్టారు. ఎందుకని అడిగింది సుశీల. "మామయ్య పిల్లలేం, సుబ్బిగాడు సీతాను జీడికడ్డీలు కొనుక్కొని తింటున్నారమ్మా. మాకో ముక్కైనా పెట్టడంలేదమ్మా, మేముకూడా కొనుక్కొని తింటాం. ఇయ్యవమ్మా" అంటూ వేధించసాగారు. అప్పుడే రామమూర్తి పిల్లలు సుబ్బిగాడూ, సీత జీడికడ్డీలు చప్పరిస్తూ అటువచ్చి గుమ్మంలో నిలబడ్డారు. పాపా సుకుమార్‌లను మరికాస్త ఏడిపించడానికన్నట్లు గర్వంగా లొట్టలు వేస్తున్నారు. సుశీల డబ్బు లెక్కడనుంచి తెచ్చి ఈయగలదూ. ఆమెదగ్గర ఎర్రని ఏగాని కూడా లేదు. అన్నిటికీ అన్నగారినడగాలి. అన్నగారు వదినగారినడగాలి. అందువల్ల ఆమెకు అన్నగారిని డబ్బులడగడం తలకొట్టేసినట్లుంటోంది. పిల్లలకేం తెలుస్తాయి ఈబాధలు! తల్లిని

"ప్రేయసీ, నీ జడలోని పూవుల పరిమళం ఆఘ్రాణిస్తూ ఉంటే, నందనోద్యానంలో విహరిస్తున్నట్లుంటుంది."

"ఓ పావుగంటసేపు అందులోనే ఉండు. మానాన్నొస్తున్నాడు."

వేపుకొని నసాగారు. ఇంతలో సుశీల తల్లి శేషమ్మ అటువచ్చి "ఏమ్రా అత్తయ్య పిల్లలకు కూడా పెట్టండ్రా" అంది కొడుకు పిల్లలతో. వాళ్లు చెరో ముక్క ఎంగిలిదే తుంపి పాపా సుకుమార్‌ల చేతుల్లో పెట్టారు. పాపా సుకుమార్‌లు ఆ ముక్కలు వెంటనే నోట్లో వేసుకొని గంతులు వేసుకుంటూ వెళ్ళిపోయారు. ఆ దృశ్యం చూసి సుశీల కళ్ళనీళ్ళాపుకోలేకపోయింది. తన పిల్లలు ఎంగిలికాశపడే గతి వచ్చింది! తల్లి తన కన్నీళ్ళు చూస్తుందేమోనని త్వరగా మొగం త్రిప్పివేసుకొని చీర కొంగుతో తుడుచుకొని వంట సాగించింది.

సీతారామయ్యగారు వ్రాసిన ఉత్తరం విషయం అప్పుడే ఊరంతా ప్రాకిపోయింది. గ్రామస్థులందరూ వచ్చిపడ్డారు. "ఎంత దుర్మార్గుడుగా తయారయ్యాడమ్మా! లక్ష్మి లాంటి భార్యను విడిచిపెట్టి ఆ పాపిష్ఠిముండ ఎవతో దానివెంబడి పోతాడా! మాకెదురు పడవలసింది మేం తగువిధంగా బుద్ధి చెప్పి ఉందుము" అంటూ నలుగురూ నాలుగు విధాలుగా సానుభూతి ప్రకటించసాగారు. అది వారి దృష్టిలో సానుభూతి అయితే కావచ్చును కాని సుశీలకు మాత్రం ప్రాణకంటకంగా ఉంది వాళ్ల మాటలు వినడానికి. తన భర్తనుగురించి వాళ్లంటున్న మాటలు ఆమెలో అతనిపట్ల మరింత అభిమానం రెచ్చగొట్టాయి. సుశీల మాట్లాడకుండా కూర్చుంది.

ఇంతలో ఎవరో అరిచారు "అదేమమ్మా సుశీల మొగుడు ఇటు వస్తూంటేను! అదె వరూ ఆ దూరాన" అని.

సుశీల ఒక్క ఉరుకులో వీధిలో పడింది. అందరూ కూడా వీధిలోకి వచ్చేరు. రఘు మెల్లగా వస్తున్నాడు. సుశీల గుండె చేతితో అదుముకుంది-ఆనందం పట్టలేక. ఎదురు పరుగెత్తి వెళ్లి కాళ్లమీద పడి కన్నీరుతోనే కాళ్లు కడిగి తీసుకురావాలనిపించింది భర్తని. పాపా సుకుమార్‌లు అప్పుడే పరుగెత్తి వెళ్లారు. రఘు ఇద్దరినీ ఎత్తుకొని ముద్దాడి

దింపాడు. వాళ్లు చెరో చేయి పట్టుకొని లాగుకు వస్తున్నారు గంతులు వేస్తూ.

సుశీల తల్లి శేషమ్మ అంటోంది "రానీ బాగా గడ్డి పెట్టాను—" అంతలో సుశీల దెబ్బ తిన్న ఆడ పులిలా ఆమె మీదకు తిరిగింది. ఆమె వాలకం చూసి తల్లికే భయం వేసింది. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారామెకేసి. "అమ్మా నువ్వు ఆయన గురించి నోరు మెదిపావా నేను మళ్ళీ నీ మొగం చూడను. నేనిక్కడ ఉండగా ఎవరూ ఆయనను పల్లెత్తు మాట అనడానికి వీలు లేదు" అంది.

రఘు దగ్గరకు వచ్చాడు. పది గజాల దూరంలో ఆగిపోయాడు. అందరినీ చూసి అతనికి ధైర్యం చాలలేదు. తల వంచుకొని నిలబడ్డాడు. పిల్లలు "రా నాన్నా అంటూ బలవంతంగా లాగుకు వచ్చారు. రఘు వచ్చాడు. సుశీల భర్తదగ్గరకు పరుగెత్తబోయింది. తల్లి పట్టుకొని "ఇక్కడ బాగుండదమ్మా, లోపలికి రానీయి" అంది. రఘు లోపలికి వచ్చాడు. సుశీల ఇక ఆగలేకపోయింది. అతని కాళ్ళమీద పడింది. రఘు లేవనెత్తాడు. అరుగుమీద గ్రామస్థులు ఇంక తామక్కడ నిలబడితే బాగుండదని మెల్లగా ఎవరిళ్ళకు వారు జారుకున్నారు. రామమూర్తి బావమరిది ఎదుట పడడానికి సంకోచిస్తూ వంటింట్లోకి పోయి "ఈవేళ మంచి పిండి వంటలు వండు మా చెల్లెలు సంతోషించేటట్లు. నేను కొట్టుకు పోయి సరుకులు పంపిస్తాను'' అని చెప్పి వీధిలోకి వెళ్ళిపోయాడు. శేషమ్మ కూతురి శాసనం జ్ఞాపకముంచుకొని ఏమీ మాట్లాడకుండా కొంచెం దూరంగా కొన్ని నిమిషాలు నిలబడి దొడ్లోకి వెళ్లి మనుమరాలి చేత కాళ్లు కడుగుకుందుకు నీళ్లు పంపించింది. రఘు కాళ్లుకడుగుకొని వచ్చి మంచం మీద కూర్చున్నాడు. సుశీల అతని దగ్గర నేలమీద కూర్చొని అశ్రుధారలు కట్టిన కళ్ళతో అతని మొగంలోకి కొన్ని క్షణాలు చూసి, వెక్కి వెక్కి ఏడవసాగింది. రఘుకూ కళ్ళనీళ్ళు తిరిగాయి. అందరూ తలోమూలనుంచి తన మీద దాడివస్తారని మొదట్లో భయపడ్డాడు. కాని ఇక్కడ ఎవరూమాట్లాడకపోవడం చూసి ఆశ్చర్యపోయాడు. సుశీల ముందు తన హృదయభారం వెడలగక్కుదామనుకుంటున్నాడు కాని నోట మాట రావడం లేదు. లేచి పడుతున్న సుశీల వెన్నుకేసి చూసి తల నిమురుతూ ఉండిపోయాడు. సుశీల హృదయంలో భారమంతా బయటపడిపోయింది. తలెత్తి కొంగుతో కళ్లుతుడుచుకొని నవ్వుతూ లేచి నిలబడి "లెంకి ప్రయాణం చేసివచ్చారు. అలసిపోయి ఉంటారు, నీళ్లు పోసుకుందురుగాని"అని భర్తకుస్నానం ఏర్పాటు చేసింది. సుశీల తన నెప్పుడో క్షమించివేసిందని రఘుకు తెలుసు. అయినా బయటపడ్డ అపరాధిలా సిగ్గుపడుతూ ఆమె వెనకాలే మాట్లాడకుండా వెళ్లాడు. వేడినీళ్ళ స్నానంచేసి బట్టలు ధరించాడు. సుశీలే అతని చొక్కాకి బొత్తాములు పెట్టింది. ఇంతలో రామమూర్తి వచ్చాడు.

అందరూ భోజనాలకు కూర్చున్నారు. భోజనాలదగ్గరే సుశీల అన్నగారితో చెప్పింది: "అన్నయ్యా, నీవు భోంచేసి ఒక బండి తీసుకురా" అని.

"బండి ఎందుకమ్మా" అని అడిగాడు రామమూర్తి తెల్లబోతూ.

సుశీల విప్పారిన మొగంతో గర్వంగా చూస్తూ "మా యింటికి వెళ్ళిపోవాలి!" అంది. రఘు భార్యకేసి ఆరాధనా దృష్టితో చూశాడు. సుశీల నిజంగా దేవత!

శేషమ్మ అంది: "అదేమిటమ్మా, అతను వచ్చాడో లేదో అప్పుడే ప్రయాణమంటావేమిటి? ఇద్దరూ కలిసి కొన్నాళ్లుండి పోరూ?

"లేదమ్మా. ఈ వేళే వెళ్ళిపోవాలి. అన్నయ్యా, వెంటనే బండి తీసుకువస్తావు కదూ" అని మళ్ళీ అడిగింది.

"అలాగే తీసుకువస్తానమ్మా" అని రామమూర్తి భోజనంచేసి బండిని కుదుర్చుకు రావడానికి వెళ్లాడు.

సుశీల భర్తకు తాంబూలమందిచ్చి, పిల్లలను పిలిచి తనూ వారితో తొందరగా భోజనం చేసింది. తన సామాన్లన్నీ సర్దింది. బండి వచ్చింది. సామాన్లు బండిలో పెట్టారు. సుశీల తల్లికీ, అన్నగారికీ నమస్కారం చేసింది. వదినగారు "హఠాత్తుగా వెళ్ళిపోతున్నావమ్మా. చీర పెట్టలేకపోయాం. ఇప్పటికి రవికెగుడ్డ తీసుకో"అని బొట్టుపెట్టి పసుపు కుంకం పొట్లాలతో ఆ గుడ్డ ఇచ్చింది. సుశీల పిల్లలతో బండిలో కూర్చుంది. రఘు కూడా కూర్చున్నాడు. బండి కదలబోతూండగా రామమూర్తి "బావా, ఏమీ అనుకోకోయ్. చేరగానే ఉత్తరం రాయి. సంక్రాంతికి మీరు మళ్ళీ రావాలి తప్పక" అన్నాడు. రఘు విచారంగా నవ్వి ఊరుకున్నాడు.

బండి కదిలింది. రఘు వచ్చినప్పటినుంచి ఒక్కమాట పలకలేదు. సుశీల తనను క్షమించివేసిందని తెలిసినా తానామె ముందు తన అపరాధం ఒప్పుకుంటేనేగాని తన హృదయం తేలిక పడేటట్లు లేదని "సుశీ—" అని నోరు తెరిచాడు. కాని సుశీల అతని చేతులు పట్టుకొని "నాకేమీ చెప్పవద్దు. జరిగిన దానిని పూర్తిగా మరచిపోదాం. అదంతా ఒక పీడకల అను కుందాం. ఆ విషయమే ఎత్తకండి" అంది అతని కళ్లలోకి చూస్తూ ప్రేమతో నిండిపోయిన నేత్రాలతో.

రఘు "నీ వెంత మంచిదానివి, సుశీ" అనగలిగాడు.

"మీరు మాత్రం మంచి వారు కారూ? నాకోసం వచ్చారు" అంది సుశీల నవ్వుతూ.

బెజవాడలో ఇంటికి చేరే సరికి సీతారామయ్యగారు లోపల కూర్చొని ఉన్నారు. రఘు ఇంటి తాళంచెవి ఆయన కిచ్చి వచ్చాడు. ఆయన ఇల్లంతా శుభ్రం చేయించి ఉంచారు. సుశీల వచ్చి ఆయన పాదాలకు నమస్కరించింది. "దీర్ఘ సుమంగళివై పుత్ర పౌత్రులతో సుఖపడు తల్లీ" అని ఆశీర్వదించారు ఆయన. "మీ యిల్లు సిద్ధం చేసి ఉంచాను. నీవు తిన్నగా వంట ప్రయత్నం చేసుకోవచ్చమ్మా" అని సుశీలకు చెప్పి "నాయనా, రఘూ నేను మేనేజరుతో మాట్లాడాను. ఆయన చాలా మంచివాడు. నీ స్థానంలో మరొకరిని ఇంకా నియమించలేదు. రామలింగయ్యగారే నీ పని చూస్తున్నాడు. అందువల్ల నీకవకాశం ఉంటుంది. నీవిప్పుడే వెళ్ళి ఆయనతో మాట్లాడి రా, నాయనా" అని రఘుతో చెప్పారు. రఘు ఇంట్లోకి వెళ్ళి దుస్తులు మార్చుకొని ఆఫీసుకు వెళ్ళాడు మేనేజరుతో మాట్లాడుదామని. సీతారామయ్యగారు కూడా వేరే పనిమీద వెళ్లారు.

వెంకటలక్ష్మమ్మగారూ, రామమ్మ, జానకమ్మ వగైరాలందరూ వచ్చిపడ్డారు. సుశీలను చుట్టివేశారు. తలోక రకంగా ప్రశ్నలు వేయసాగారు. సుశీల చిరునవ్వుతో వాళ్ళ ప్రశ్నలకు జవాబు ఇవ్వకుండా తప్పించుకుంటూ మౌనంగానే కూర్చుంది. వాళ్ళు తోచిన వ్యాఖ్యానాలు మొదలుపెట్టారు. సుశీల కిప్పుడు వాళ్ళ వ్యాఖ్యానాలు రుచించడంలేదు. వాళ్ళను వదిలించుకునే ఉపాయంలేక అలాగే కూర్చుంది.

మరికొంతసేపటికి సీతారామయ్యగారు వచ్చారు. "ఏమమ్మా, మీ ఆయన రాలేదా ఇంకా" అని అడిగారు. రాలేదని చెప్పింది

 అబల 

సుశీల. సీతారామయ్యగారు భార్యతో "ఇంక ఇంటికి నడిచి వంటప్రయత్నంలో పడతావా లేదా? సుశీలమ్మమాత్రం వంటచేసుకోవద్దూ? నీ కబుర్లతోనే కడుపునిండుతుందనుకుంటున్నావేమిటే?" అన్నారు. వెంకటలక్ష్మమ్మగారు మొగుడికేసి చురచురా చూసి మూతి విరుచుకొని బయలుదేరింది. తక్కినవాళ్లు కూడా "తరువాత వస్తాములే అమ్మా" అని వెళ్ళారు.

సీతారామయ్యగారు లోపలికి నడిచారు. "నాకోసం కూర్చోవమ్మా. నీవు వంటచేస్తూ ఉండు. నేను నీతో కాసేపు మాట్లాడి వెళ్తాను." అన్నాడు. సుశీల వంట చేయడం మొదలుపెట్టింది. సీతారామయ్యగారికి ముక్కాలిపీట వేసింది. ఆయన దానిమీద కూర్చొని "అత నేమైనా చెప్పాడా, తల్లీ" అని మెల్లగా అడిగారు. "లేదండీ నేనే చెప్పనీయలేదండీ" అంది సుశీల.

సీతారామయ్యగారు సంతోషంతో "నీవెంత మంచిదానివమ్మా అత నెక్కడివరకు వెళ్ళివచ్చాడో తెలుసా? హరిద్వారంవరకూ వెళ్లాడు. హిమాలయ పర్వతాలపైకి కూడా వెళ్ళిపోదామనుకున్నాడట. వెళ్ళిపోతే ఏమయ్యేదో! మళ్లీ మనం రఘును చూడగల్గుదుమో లేదో, చూసినా ఈ వేషంలో చూడగల్గుదుమో లేదో" అన్నారు. సుశీల భయంతో చూసింది. "అక్కడ పుణ్యక్షేత్రాలలో తిరిగే బైరాగి మూకల దురాచారాలూ, కక్కుర్తి పనులూ, శ్రీరంగనీతులూ విని చూసి వెగటుకలిగి వెనక్కి తిరిగి వచ్చాడు - నీ అదృష్టం బాగుండబట్టి. నిన్న ఉత్తరం రాశాను మీకు. సాయంత్రం నాకు ఇతను కనిపించాడు. వెంటనే మీదగ్గిరికి పంపించాను. చూశారా తల్లీ, ఏ విషయంలోనూ కూడా తెగేదాకా లాగకూడదు. అందులోనూ దాంపత్య విషయంలో మరీని. పట్టుదలలు పెంచుకోకూడదమ్మా. లోకుల మాటలు ఆధారం లేనిదే సులభంగా నమ్మకూడదమ్మా. లోకులు కాకులు. వాళ్ళకేం ఎన్నైనా చెపుతారు వినేవాళ్ళుంటే-వాళ్లదేమీ పోయేదిలేదు కాబట్టి నష్టపోయేది మనము. చూడమ్మా తరుచు మన చేతిలోనుంచి జారిపోయేవరకూ వస్తువువిలువ మనకు తెలియదు. ఇప్పుడు నీ భర్త అంటే నీకెంత ప్రాణమో పూర్తిగా తెలియవచ్చిందనుకుంటాను. నీమీద ఎంత ప్రేమో రఘుకీ తెలియవచ్చి వుంటుంది." అంటూంటే సుశీల కళ్లలో నీళ్లు నిలిచాయి. "భార్యాభర్తలు ఒకరి అభిరుచులొకరు తెలుసుకొని నడచుకోవాలమ్మా. సంసార సౌఖ్యం ఇద్దరి కోడ్పాటు మీదా ఆధారపడి ఉందమ్మా. ఆధారం లేని అనుమానాలూ, వదంతులూ, పట్టుదలలు సంసార సౌఖ్యం పాడుచేయకుండా చూసుకోవాలి తల్లీ" అన్నారు సీతారామయ్యగారు. సుశీల కన్నీరు ధార కట్టింది.

సీతారామయ్యగారు మళ్ళీ అడిగారు. నామీద నీకు నమ్మకముందా తల్లీ"

"అదేమిటి బాబుగారూ, మీమీద నమ్మకం లేకపోతే మరెవరిమీద ఉంటుంది? వారికి కూడా మీమీదే నమ్మకం" అంది సుశీల.

"అయినప్పుడు ఒకమాట చెపుతాను వింటావా? ఆ అమ్మాయినిగురించి నీవు చాలా కోపం కలిగి ఉన్నావే, ఆ అమ్మాయి చాలా ఉత్తమురాలు అని నా విశ్వాసం అంటే నమ్ముతావా? ఎంత ఆలోచించినా నాకామె నడతలో చెడ్డ ఏమీ కనుపించలేదమ్మా. చదువూ సంస్కారమూ కలది. మర్యాదా, అభిమానమూ అన్నీ ఎరిగిన మనిషి ఆమె. ఆమె మీఇంటికి వచ్చినప్పుడు ఎంత నిర్దయగా ప్రవర్తించారు మీరు? ఆమె ఎంత బాధపడి ఉంటుందో నీవెప్పుడైనా ఊహించుకున్నావా తల్లీ. ఆమెకే దురుద్దేశ్యముంటే నీ స్నేహంకోసం అంత ప్రాకులాడునా?"

ఇంతలో రఘు తిరిగి వచ్చాడు. "ఏం నాయనా, ఏం జరిగింది. కాయా పండా?" అని అడిగారు సీతారామయ్యగారు.

రఘు చిరునవ్వుతో "రేపటినుంచి ఆఫీసుకు రమ్మన్నారండీ" అన్నాడు.

సీతారామయ్యగారు వెళ్ళడానికి సిద్ధమవుతుండగా సుశీల "బాబుగారూ, మీరు కూడా ఈపూట మాతో ఇక్కడే భోంచేయాలి" అంది. సీతారామయ్యగారు "అలాగే తల్లీ, నీచేతితో పెట్టిన భోజనం ఎవరు వద్దనగలరు. కాని నీవుకూడ మాతో పాటుకూర్చొని భోజనంచేయాలి" అన్నారు. అలాగే ఆయనా, రఘు, సుశీలా పిల్లలూ అందరూ కలిసి ఒకేసారి భోజనం చేశారు.

భోజనం చేసిన తరువాత సీతారామయ్యగారు "తల్లీ, ఒకసారి నీవీణతెచ్చి హాయిగా ఒక కృతి పాడి వినిపించు. నీపాట విని చాల కాలమయింది'' అన్నారు. సుశీల ఒక నిమిషం సిగ్గుతో నిలబడి, లోపలికి పోయి వీణ తెచ్చింది. రఘూ, సీతారామయ్యగారు కొంచెం దూరంలో కూర్చున్నారు. సుశీల "శాంతమూ లేక సౌఖ్యమూ లేదు'' అనే కృతి పాడసాగింది. ఆమె హృదయమూ వీణ హృదయమూ ఏకమై శ్రోతలను పరవశం జేశాయి. కొంతసేపుండి సీతారామయ్యగారు లేచి "నేను వెళ్ళివస్తానమ్మా. నీవు పాట మానివేయకు. ఎన్నాళ్ళ నుంచి వినాలనుకుంటున్నాడో నీపాట మీ ఆయన" అని తలుపుదగ్గర పెట్టి ఇవతలకు వచ్చారు. సుశీల కంఠం కమ్మగా వినిపిస్తూనే ఉంది.

"పది గంటలైనా వంట కాలేదా?......సరే నేను హొటల్లో అఘోరిస్తా."

"అయ్యో...ఒక్క రెండు నిముషాలు ఆగలేరండీ."

"ఏం రెండు నిముషాలలో తయారవుతుందా?"

"అహఁ. అది కాదు. నేను కాస్త మొహం రుద్దుకుని తయారవుతా. ఇద్దరం హొటలికే పోదాం ఇవాళ్టికి."

సీతారామయ్యగారు ఇవతలికి వచ్చేసరికి భార్య ఎదురైంది "ఎందుకు వచ్చావు" అని అడిగారాయన. "కంది పచ్చడి చేశాను. కాస్త సుశీలమ్మకిద్దామని తెచ్చా"నందిఆవిడ.

సీతారామయ్యగారు అడ్డుపడ్డారు. "నీ కందిపచ్చడి లేకపోతే వాళ్ళకి అన్నం గొంతుక దిగకపోదులే. వాళ్ళభోజనాలయిపోయాయి. ఈవేళ నాకు కూడా పథ్యం భోజనం తప్పి పరమాన్నభోజనం లభించింది. లోపలికి పోకు. భార్యాభర్తలిన్నాళ్ళకు తిరిగి కలుసుకున్నారు. ఎన్ని విషయాలుంటాయో చెప్పుకోడానికి. నీవు వెళ్లి పడకు పానకంలో పుడకలా. పద, మనం కూడా మన ఇంటికి పోయి సరదాగా నీ సాధింపులు విందాము'' అన్నారు సీతారామయ్యగారు నవ్వుతూ.

భార్య విపరీతంగా మూతి విరుచుకుంది. "అయ్యో, అదేమిటి, నామీద కోపం వస్తే చంటిపిల్లవాడిని మాడలకొట్టా వెందుకు? వాడిని నాచేతి కిచ్చి నీవు కావలసినంత ఒళ్లు విరిచేసుకో" అని చంటిపిల్లవాడిని తీసుకున్నారు ఆయన వెనకాలే వెళ్ళింది భార్య మూతి తిప్పుకుంటూ.

(ఇంకా ఉంది)




# పిల్లల కథలు  ఇల్లిందల సరస్వతీదేవి

"నాకు తిరిగి అవకాశమిస్తే మా అమ్మ దగ్గర కూర్చుని పండువెన్నెలలో చిందుజాబిల్లిని చూస్తూ, ఆమె చెప్పేకథలను వినాలని ఉన్నది" అని తనకోరికను వెలిబుచ్చాడొక విజ్ఞానవేత్త.

తాను తెలిసికోవలసిన అంశమేదో మిగిలిపోయిందనీ, దానికి బాల్యదశలోనే పునాది ఏర్పడాలి కనుక తనకా అవకాశము తిరిగి లభిస్తే బాగుండుననీ ఆయన అభిలషించాడు.

బాల్యదశ పదహారు సంవత్సరాల వరకూ అని కొందరంటే 18 వరకే నన్నారుకొందరు. ఈ వివాదము మనస్తత్వ శాస్త్రజ్ఞులకూ విద్యావేత్తలకూ మధ్య నడచేది. ఇంతకూ— పదహారు సంవత్సరాలయినా పద్దెనిమిది సంవత్సరాలయినా నిండు నూరేళ్ళ జీవితములో ఎన్నోవంతు? ఇది చాలా స్వల్పభాగమే. అయితేనేమి - నిండు జీవితానికి సరిపడ్డ విజ్ఞానానికీ వికాసానికీ ప్రాతిపదిక బాల్యములోనే ఏర్పడాలి ఈ భావమే మరొక మాటలో 'Child is the father of the man' అన్నాడు సుప్రసిద్ధ ఆంగ్ల కవి వర్డ్సువర్తు తరుణావస్థకంటె బాల్యదశ ముందుగా కలిగేది కనుకనూ, నేటిబిడ్డ భావిపౌరుడు కనుకనూ ఆ నుడి నానుడి అయింది.

చిన్న బిడ్డలు భావిపౌరులనుకొంటే బాల్యదశకు చాలా ప్రాముఖ్యము కనబడుతుంది. ఈ దశలో భావిజీవితానికి ఉపయోగకరమైనదీ విజ్ఞానకరమైనదీ ఒక ప్రాతిపదికను ఏర్పరచాలంటే మార్గము? ఈ మార్గాన్ని అనేక సంవత్సరాల క్రిందటే - ఇంచుమించుగా మానవుడి పుట్టుక ఆరంభమయిన కాలము నుండీ మనపూర్వులు అన్వేషిస్తూ వచ్చారు. పెద్దవాళ్ళు చిన్న బిడ్డలను కూర్చుండబెట్టుకుని బుద్ధులూ సుద్దులూ చెప్పుతూ ఆ మార్గాన్ని అనుసరిస్తూ ఉండేవారు. కేవలము నీతులు చెప్పటానికని పిలిస్తే పిల్లలు దగ్గరకు రారు కనుక నీతిని కథలలో ఇమిడ్చి చెప్పేవారు. ప్రపంచజ్ఞానము, ధర్మాధర్మ విచక్షణ, బ్రతుకు తెరువు, జీవులస్వభావాలు -ఒకటేమిటి ప్రపంచ పరిస్థితులన్నీ ఇమిడ్చి బిడ్డలకు తూహలం రేకెత్తేటట్లు వినిపిస్తూ ఉండేవారు. దీనికి సాధనాలయిన కథలలో మానవులే పాత్రలుగా ఉండాలన్న నియమములేదు. అన్ని రకాల జంతువులను సామాన్య మానవులను ప్రవేశపెట్టేవారు. మానవులలో అన్ని తరగతులనూ రాజు దగ్గరనుండి పేదవరకూ కథలలో ఇమిడ్చేవారు. కథలలో దుర్మార్గముగా కర్కశముగా ప్రవర్తించేవారు రాక్షసులు. సామాన్య మానవుడికి అలవిగాని వాటిని దేవతలూ ఋషులూ తరతమ భేదాలతో ప్రత్యక్షమయి వరాలను ప్రసాదిస్తూ ఉండేవారు. ఈ కాలములో ఉన్నన్ని తరగతులు, పాఠశాలలు, విద్యాశిక్షణ పొందిన ఉపాధ్యాయులూ లేని కాలములో మూర్ఖులనిపించుకొన్న రాజకుమారులను ఆరు నెలల్లో సకల నీతిశాస్త్ర కోవిదులనుగా బృహస్పతివంటి విష్ణుశర్మ తయారుచేసినట్లుగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన పంచతంత్రకథలు సాక్ష్యమిస్తున్నాయి. బిడ్డలకు ఏది చెప్పినా కథారూపములోనే ఉండాలన్న సిద్ధాంతన్ని అన్ని దేశాలలోనూ ఆ కాలమునుండీ అంగీకరిస్తూ వచ్చారు.

ఆ కాలములో బిడ్డల వయస్సునుబట్టి విషయ విభజనను అంతగా పాటించక పోయేవారు - క్రమముగా విద్యావేత్తలు దీనికి కొన్ని విధానాలను సూచించి నిర్ణయము చేశారు మనస్తత్వ శాస్త్రజ్ఞులు వాటిని ఆమోదించలేదు బిడ్డలకు బాల్యదశలోకూడా శారీరక పరిణామము మానసిక పరిణామము వివిధకాలాలలో జరుగుతుంది. కనుక ఆపూర్వ

# ★ పిల్లల కథలు. ★

లకు తగినట్లుగా విజ్ఞానబోధ కావలెనన్నారు. వీరి సిద్ధాంతాల ననుసరించి బాల్యదశ పద్దెనిమిది సంవత్సరాలకాలము. దీనిలోకూడా బిడ్డల మనః ప్రవృత్తిలో ప్రత్యేకమైన మార్పులు కలిగే ఘట్టాలు ఆరు, పదకొండు సంవత్సరాలలో కనుక ఈదృష్ట్యా బాల వాఙ్మయాన్ని సవరించాలని అభిప్రాయపడ్డారు. ఈ శాస్త్రజ్ఞులు చేసిన విభజన ననుసరించి బిడ్డలకు మూడు సంవత్సరాల నుండి ఆరు లేక ఏడు సంవత్సరాలవరకు మానసికమైన పెరుగుదల కలుగుతుంది. ఆరు లేక ఏడు నుండి ఎనిమిది సంవత్సరాలవరకు శారీరకమైన పెరుగుదల; తిరిగి ఎనిమిది నుండి పన్నెండు సంవత్సరాలవరకు మానసికమైన పెరుగుదల అని వారి నిర్ణయము.

ప్రారంభదశలో బిడ్డలకు దైహికముగా తమకు కలిగిన శక్తిని ఉపయోగించాలన్న ఉత్సాహము కలుగుతుంది. కనబడిన వస్తువులను ఎత్తాలనీ, వాటిని ఒక చోటనుండి మరొకచోటికి తీసుకొనిపోవాలనీ ఉంటుంది.

ఈ పరిణామదశలో పాఠశాలలలో గాని ఇంటివద్దగాని బిడ్డలను ఒకచోట కూర్చుండబెట్టి మనము చెప్పినదేదో వినమంటే వినరు. పదిసార్లు లేచికూర్చుంటారు, కలుదుతూ ఉంటారు. ఈ దశలో బిడ్డలకు దైహికచలనము అధికముగా ప్రదర్శింపబడిన కథలు - పరుగెత్తి పట్టుకోవటము, ఒకదానిని ఇంకొకటి మించి పరుగెత్తటము మొదలయిన ఘట్టాలు మనస్సునాకర్షిస్తాయి. ఒక పాఠశాలలో ఉపాధ్యాయిని సిపాయిల యుద్ధాన్ని గురించిన కథ చెప్పుతుండగా పిల్లలు లేచి వారిలోవారు కట్టుకోవటము జరిగినదట. ఈ దశలో బిడ్డలు అశక్తులుగా ఉన్నా మానసిక పరిణామము ఆగదు. కాగా దానికి తగినట్టుగా దేహాన్ని కదలించలేని అశక్తతలో చికాకు కలుగుతుంది. ఈ విధమయిన కథలు వినటమువల్ల కొంత సంతృప్తి కలుగుతుంది. ఈ వయసులో జంటమాటలూ వాటికి తగిన లయ - రాగము గల గేయాలలో కథలను వినిపించినట్లయితే ఆ బిడ్డలు కూడా నేర్చుకొని పాడుతూ ఉంటారు.

తరువాతి దశలో బిడ్డలకు కుతూహలము ఎక్కువగా ఉంటుంది. దాని పరిణామము 'ఈ పనిచేస్తే ఏమవుతుంది? ఆ పనిచేస్తే ఏమవుతుంది?' అన్న కుతూహలము కొద్దీ పారబోయటము, పగులగొట్టటము, విరగగొట్టటము మొదలయిన చేష్టలని శాస్త్రజ్ఞులు తీర్మానించారు. పగులగొట్టటము విరగగొట్టటము జరిగిన తరువాతి తిరిగి వాటని యథాస్థితికి తీసుకొని రావలెనని ప్రయత్నిస్తారు. ఈ దశలో బిడ్డలమనసులలో 'ఎందుకు? ఏమిటి? ఎట్లా?' అన్న ప్రశ్నలు ఉద్భవించి బిడ్డలను ఉద్వేగపరుస్తూ ఉంటాయి. కనుక ఈ దశ ననుసరించి కౌతూహాల తృష్ణను తీర్చగల కథలు చెప్పాలి.

బిడ్డలకు ఇచ్చే విజ్ఞానాన్ని నాలుగు విధాలుగా విభజించినట్లయితే ఉపయుక్తముగా ఉంటుందని విద్యావేత్తలు నిర్ణయించారు. మొదటిది శృతము, రెండవది దృశ్యము, మూడవది పదము, నాలుగవది పఠనము. వీటికి అనుకూలమయిన ప్రక్రియలను సిద్ధముచేయాలని నిశ్చయించారు. ప్రథమ శ్రేణిలో కథలు, రెండవదానిలో నాటకాలు, మూడవదానిలో గేయకథలూ, పదాలు, నాలుగవది పఠనయోగ్యమైన విజ్ఞానము.

దానంతట అది సహజముగా అడవివలె పెరగటానికి అలవాటుపడిన నిద్రాణ స్వభావమునుండి అదేపనిగా మేల్కొలిపే రచనలు బిడ్డలకు కావాలని మనస్తత్వ శాస్త్రజ్ఞులు భావించారు. దీనికి అద్భుతరసము చక్కగా ఉపయోగిస్తుంది. ప్రకృతిలో ఉన్న అద్భుతచిత్రాలను విచిత్రాంశాలతో మేళవింపచేసి పిల్లలకు వినిపించాలి. 'కురూపినిచూసి అందరూ అసహ్యంచుకుంటారు. ఎవరూ గౌరవించరు. అటువంటి దీనుడు దుఃఖపడుతూ ఒక చెట్టుక్రింద పడుకొని ఉండగా విహారార్థము ఆ మార్గాన వెళ్లే దేవతలు అతడిని కరుణిస్తారు. అతడు నిద్రలేచి చూచుకొనేసరికి సుందరుడైపోతాడు, తనను తాను నమ్మలేని స్థితికి వస్తాడు. ఇంకొకడు నదిలో స్నానముచేయగానే ఉన్నరూపము పోయి విరూపము ఏర్పడుతుంది. ఈ వ్యక్తులిద్దరికీ రూపాలు మారుతున్నకొద్దీ ప్రజలకు వారియెడ గౌరవాభిమానాలు మారుతూ ఉంటాయి. ఇలాగే ఒక నిరుపేద కన్నుమూసి తెరచే అంతలో భాగ్యవంతుడయిపోతాడు. ఒకరాజు మరునాటికి బికారిఅయిపోతాడు. ఒకడు కీలుగుర్రమెక్కి వారము దినాలలో దేశాలన్నీ చుట్టివస్తాడు. ఒకడు చేతినున్న ఉంగరము నేలకురాస్తే ఒక సేవకుడు ప్రత్యక్షమవుతాడు. ఆ సేవకుడు రాక్షసుడైనా చేతులు జోడించుకొని వినయములో ప్రభువు ఆజ్ఞలను పాలిస్తాడు.' ఈ విధముగా ఒకదానితరువాత ఒకటి వెంట వెంట మానసికోద్వేగాన్ని పెంపు చేసే సంఘటనలతో కథలు అల్లాలి. ఈ సందర్భములో ఇది సంభవమా-కాదా అన్న మీమాంస పెట్టుకొంటే కుదరదు. సంభావ్య శ్రేణికి చెందినవీ చెందనవీ రెండురకాలూ అవసరమే.

బిడ్డలకు కరుణాత్మకమైన కథలూ గాథలూకూడా అవసరమే. మానసికపరివర్తనము కలిగించే శక్తి ఆ కథలలో ఎంతైనా ఉంటుంది. ఒకతల్లి తనకుమారుడికి ఒక పేదపిల్లవాడికథ చెప్పుతున్నది-'ఆ పేదపిల్లవాడు ఆకలితో ఏడుస్తూ దారివెంట నడుస్తున్నాడు' అంతవరకు కథవిన్న ఆమె కుమారుడు 'ఆ అబ్బాయికి అమ్మలేదా అన్నము పెట్టటానికి?' అని ప్రశ్నించాడట. అతనికి తల్లి లేదని తెలియగానే తన చేతిలోఉన్న బిస్కట్లను ఇవ్వటానికి సిద్ధమయినాడట. ఈపని ఆ వయస్సులో కథలువినే పిల్లలందరూ సామాన్యముగా చేస్తూఉంటారు. కథలలో ఏ పాత్రకు ఆపదకలిగినా విచారపడుతూ-దుఃఖిస్తూఉంటారు.

పిల్లలకు దుఃఖములో కూడా కుతూహలము ఎక్కువగా ఉంటుంది. ఒకపిల్లడు గొల్లవాడు ఎలుగుకథ చెప్పమని మేనత్తను రోజూ వేధించేవాడట. ఆ కథలో ఎలుగుబంటి అడవి మార్గాన నడుస్తూ ఉంటుంది. ఒక గొల్లపిల్లవాడు కట్టెలు ఏరుకోవటానికి అక్కడికి వస్తాడు. ఎలుగు ఆ పిల్లవాడిమీద పడి దేహామంతా గోళ్లతో గీరుతుంది.

## అంతా రచయితలే

వాళ్ళింటో ఇంటిల్లిపాదీ రచయితలే. ఆయన భార్య నవలలు వ్రాస్తూంది; అవి అచ్చుపడ లేదనుకోండి. వాళ్లమ్మాయి ట్రాజడీ కథలూ, ఖండకావ్యాలు వ్రాస్తూనే ఉంది. పొరపాటున తెరచామని ఒప్పుకుని మన్నించ కోరుతూ పత్రికలవారు వాట్ని తిప్పి పంపించివేస్తునే ఉన్నారనుకోండి.

వాళ్లబ్బాయి నాటకాలు రాస్తాడు. వాటిని ఎంచేతో ఎవ్వరూ ప్రదర్శించ లేదనుకోండి.

సరే ఇంటాయన, గృహ సారథి చెక్కులు రాస్తూ ఉంటాడు. ఇంటిల్లుపాది రచనలలాగే, అవీ చెలామణీ కావటం లేదు.

రక్తముతో ఆ పిల్లవాడి దేహమంతా తడిసిపోతుంది. అంతటితో ఆగక ఆ ఎలుగు ఆ పిల్లవాడిని తినబోతుంది. ఇంతవరకూ విన్న అబ్బాయి 'అత్తా! వాడిని ఎలుగు తినేస్తుందేమో-తిననీయకు కథ ఆపుచెయ్యి' అని ఏడుపు ప్రారంభించేవాడట. ప్రతిదినమూ ఆ పిల్లవాడు మేనత్తను అదేకథను చెప్పమని వేధించి, తీరా కథ ఆ పట్టులోకి రాగానే ఏడవటమూ, కథ ఆపుచేయమని బ్రతిమిలాడటమూ జరుగుతూ ఉండేదిట. పిల్లలకు భావోద్రేకము కలిగినప్పుడు సంతోషమూ, తీరా క్రియకు వచ్చేసరికి భయమూ కలుగుతూ ఉంటాయి.

పిల్లలకు హాస్యరసముమీద కూడా ప్రీతే. బొటనవేలంత మనిషి ఒక దేశము వెళ్లుతాడు. ఆదేశస్థులందరూ తాటి ప్రమాణములో ఉంటారు. ఈ వేలిగాడిని మొదట చూసినవాడు అరచేతిలో పెట్టుకొని ఇటూ అటూ తిప్పిచూసి, ఆ వింత వస్తువును జేబులో వేసుకొంటాడు. ఇంటికి తీసుకొనివెళ్లి ఒక సీసాలో ఆ వస్తువును భద్రపరచుకొంటాడు. ఒక బహిరంగసభచేసి అందరికీ ఆచోద్యాన్ని చూపిస్తాడు. రాజుగారికి ఆ విచిత్రమైన జీవిని కానుకగా సమర్పిస్తాడు. ఇలాగే మరొకడిది రాక్షసాకారము. అతడు దేశాటనము చేస్తూఉండగా చీమతలకాయంత మనుష్యులు కనబడతారు. ఇతడిని మోకులతో కట్టి రాజుగారి సమక్షానికి తీసుకొని వెళ్లుతారు. ఈ పనిని ఒక లక్షమంది కలిసి చేస్తారు. ఆ రాజుగారు ఈ దీర్ఘదేహితో మాట్లాడటానికి అతడంత ఎత్తున మంచెను నిర్మించుకోవలసి వస్తుంది. ఈవిధముగానే జానెడు మనిషి మూరెడు గడ్డము, ఒకడికి ఒకకన్ను, ఒకడికి దీర్ఘబాహువులు ఉంటే పిల్లలకు ఆనందకరముగా ఉంటుంది. కాని పిల్లల కథలలో హాస్యము మితిమీరితే వెగటును పుట్టిస్తుంది. ఇది అంతగా ప్రోత్సహించ తగినదికాదు.

పిల్లల కథలలో వాస్తవికత ఉండాలన్న అభిప్రాయాన్ని శాస్త్రజ్ఞులందరూ ఆమోదించారు. కాని అతి వాస్తవికత కూడదన్నారు. ఆ కథలు విన్న పిల్లలకు ఆ విధమైన తలంపులు కలుగక మానవు కనుక మోతాదు తగ్గించాలని కేటి డగ్లస్‌వాగిన్ అభిప్రాయపడ్డది. ఒక శాస్త్రజ్ఞుడు పిల్లల కథలలో జంతువులు పాత్రలుగా ఉండటమే మంచిదని అభిప్రాయమిచ్చాడు. పసిహృదయాలలో మానవ పాత్రలు జుగుప్సాకరముగా నిలచిపోతాయనే దృష్టితో వెలిబుచ్చబడిన అభిప్రాయమది. ఈ దృష్టితోనే కాబచ్చు మన పంచతంత్రమూ హితోపదేశమూ జంతుకథలతో నింపబడ్డవి.

పిల్లల కథలలో అతిపోషణ, అతి చమత్కారము, అతి తెలివి ప్రదర్శింపబడినట్లయితే వాటి ప్రయోజనాన్ని సాధించుకోలేవు. పిల్లలకు లోకముమీద విశ్వాసము, గౌరవము, దయ, దాక్షిణ్యము కలిగించే రచనలు కథలూ అభ్యుదయకరమైనవి. కాని వీటికి మారుగా వింత పరిణామము కలిగి మేధకు వెర్రితలలు మొలిపించేవి అపేక్షించ తగినవి కావు.

పిల్లల కలథలలో సాధ్యమైనంతవరకూ (బాల్యదశలో చెప్పే కథలు) 'చావటము స్వర్గానికి వెళ్లటము' మొదలైన అంశాలు తగ్గించితే బాగుంటుంది. ఈ లోకములో కార్యసాధనచేత పదికాలాలపాటు బ్రతికి పేరు తెచ్చుకొన్న వారి జీవిత విశేషాలను పిల్లలకు చెప్పినందువల్ల వారికి ప్రోత్సాహము కలుగుతుంది. జీవితముమీద ఆశ కలుగుతుంది. ఆ వీరుల జీవితాలు ఆదర్శప్రాయముగా పసిహృదయాలలో నిలచిపోతాయి.

పిల్లలకు చెప్పే కథలలో మగపిల్లలకు వీరగాథలు ప్రీతికరములనీ, ఆడపిల్లలకు సాంసారిక వృత్తాలు, ప్రేమ ఇంపుగా ఉంటాయని సామాన్యముగా అందరూ అనుకొంటారు. మగపిల్లలకు వీరసాహస కృత్యాలతో కూడిన కథలు ప్రీతికరమయినా అన్నిటినీ కుతూహలములతో వింటునేఉంటారు. ఈ విధముగానే ఆడపిల్లలు కూడా అన్ని రకాలూ వినటానికి ఉత్సాహపడతారు. ఈ సందర్భములో కూడా అభిరుచి వైయక్తికమైనదే.

బిడ్డలకు కథలు చెప్పేటప్పుడుగాని వ్రాసేటప్పుడుగాని వారి వయసును దృష్టియందుంచుకోవలసి ఉంటుందని ఒక సామాన్య సూత్రము ఉన్నది. కాని మూడు సంవత్సరముల బిడ్డకు ఆ వయస్సులో ఉన్న వారి కథలలో అభిరుచీ ఆసక్తీ ఉండవు. పిల్లలకు తమ వయసువారి మీదకంటె రెండు లేక మూడు సంవత్సరాలు అధికముగా ఉన్న వారిమీద అభిమానమూ గౌరవమూ ఉంటాయి. వారి జీవితాంశాలను తెలిసికోవాలన్న కుతూహలము బిడ్డలకు అధికముగా ఉంటుంది.

పిల్లల కథలలో నీతిబోధ ఉండవలెనా-కూడదా అనేది వివాదాలకు దారితీసే ప్రశ్న అయింది. కథ చెప్పితేచాలు-మంచి చెడ్డలను వాళ్లే నిర్ణయించుకొంటారని కొందరు అభిప్రాయ పడుతున్నారు. కాని బిడ్డలను 'మీయిష్టము వచ్చిన మార్గాన నడవండి' అని ఏ తల్లిదండ్రులూ అనలేరేమో! 'చక్కని రాజమార్గాలు-నిష్కంటకమైనవి కొన్ని ఉన్నాయి. ఆమార్గాన నడవటానికి ప్రయత్నించాలి' అని బోధించటములో నియంతృత్వము వ్యక్తమవుతుందా? కాని

> అతడు: ప్రియా. నీకోసం ఏం చేయమన్నా చేస్తాను. కొండమీదనించి దూకుతాను. దిగంతాలకు వెళ్ళమంటే వెళ్లోస్తాను.
>
> ఆమె: వెళ్ళి, అక్కడే ఉండమంటే, ఉండిపోతావా?

బిడ్డలకు ఏదిచెప్పినా సూటిగా ఉండాలి. 'ఇది కూడదు-అదికూడదని' ఏకరువు పెట్టిన దానికంటె చేయతగినవే చెప్పితే బిడ్డలు సులభముగా గ్రహించ గలుగుతారు. కథలలో నీతిని ఇమిడ్చినట్లయితే కథ విస్మరింపబడినా నీతిమాత్రము మనసులో హత్తుకొనిపోతుంది. కాని నీతి కటికచేదుగా కఠోరముగా ఉన్నట్లయితే పిల్లలు దగ్గరికి రానీయరు. కనుక దానిలో చక్కెర కలుపనిదే బిడ్డలకు రుచించదు. కావ్యాలు కాంతాసమ్మితాలయితే పిల్లల కథలు మాతృసమ్మితాలనుకోవాలి.

పిల్లల కథలలో కర్కశవాదము ప్రవేశపెట్ట తగనిది. అది ఇతి వృత్తాన్ని పెడమార్గాన పడవేసే సంభవమున్నది. మృదువైన మాటలతో సూటిగా వివాద రహితంగా చెప్పబడిన కథలు బిడ్డలలో కర్కశవాద స్వభావాన్ని పోగొట్ట గలుగుతాయని మన స్తత్వ శాస్త్రజ్ఞులు వ్యక్తపరచారు.

బిడ్డల బాల్యదశ ఈకాలములో కొంతకాలము పాఠశాలలోను కొంతకాలము గృహములోను గడుస్తుంది. ఇంట్లో తల్లి నలుగురు బిడ్డలనూ చుట్టూ చేర్చుకొని కథలు చెప్పినట్లే, చిన్నపిల్లల పాఠశాలలలో ఉపాధ్యాయినులు విద్యార్థులను చుట్టూ చేర్చుకొని కథలు చెప్పుతూ ఉంటారు. ఈపద్ధతి కిండర్ గార్డెను పాఠశాలలలో ప్రారంభించబడ్డది.

కథలు వ్రాయటానికి రచనాపాటవము అవసరమయినట్లే కథ నోటితో చెప్పటానికి వక్తృత్వము కావలసివుంటుంది. బిడ్డల కర్త

(45-వ పేజీ చూడండి)



# చోళీడిజైను





## చోళీ డిజైను

ద్రాక్షలతవంటి డిజైనులు కంటికి నదరుగా కనబడాలంటే, కాస్త ముదరరంగులుగల మందపాటి దారాలు ఉపయోగించుకోవాలి. ఈ డిజైను తెల్లటి చోళీకి గాని ఎర్రరంగు చోళీకిగాని వేస్తే బాగుంటుంది.

దీంట్లో రెండే కుట్లు వస్తాయి. ద్రాక్ష ఆకులన్నీ, మరీ అంత లేత, బొత్తిగా ముదరా కాని ఆకుపచ్చ దారంతో గొలుసుకుట్టువేసి నింపుకోవాలి. ఇంక, తీగలకి, ఓ ఛాయ ముదరగాఉండే ఆకుపచ్చ దారంతో గొలుసు కుట్టు కుట్టుకుంటూ పోవాలి. ద్రాక్షపళ్ళకి ఒక్క రవ్వ ముదరగాఉండే ఊదా రంగు దారంతో ముద్దకుట్టు వేసుకుంటే బాగుంటుంది.

చోళీ చేతికివేసే డిజైన్ వేరే ఉంది. దీన్ని కూడా ఈ పద్ధతిలోనే కుట్టుకోవాలి. ★

---

## పిల్లల కథలు

(43-వ పేజీ తరువాయి)

మయే శైలిలో, నూటిగా, రసవంతమైన ఘట్టాలతో కథ కళ్ళకు కట్టినట్టుగా చెప్పవలసివుంటుంది. కథకు అనుకూలమయిన పదజాలమూ, చెప్పేవాళ్ల నేర్పూ సమపాళ్ళలో ఉన్నప్పుడే పిల్లలకు ఆనందము కలుగుతుంది. కథాప్రయోజనము సాధింపబడుతుంది కథలో బిడ్డలను ఆకర్షించిన ఘట్టాలు తిరిగి చెప్పటము కూడా అవసరమే. సుప్రసిద్ధమైన గ్రంథాలలోని కథలను తీసుకొని పిల్లలకు అనుకూలముగా మార్చి చెప్పవచ్చు.

కాని పిల్లలకు కథచెప్పటమంటే అనుకున్నంత సులభముకాదు. కథ చెప్పటానికి రచనాపాటవములోనుండి కొంత పుణికిపుచ్చుకోవాలి. రచయితకు లేని ఇబ్బందులు కొన్ని చెప్పేవాళ్ళకు ఎదురవుతూ వుంటాయి. కథారచయిత బాలపాఠకుల అమాయికహృదయాలలో కలిగే సందేహాలను తీర్చటానికి ఎదురుగాఉండడు. కాని, కథ చెప్పేవాళ్లకు ఆ హాయి ఎక్కడున్నది? కథను వర్ణించి చెప్పుకొనిపోతుంటే శ్రోతలకు అనేకసందేహాలు కలుగుతూవుంటాయి పులి, నక్క, బ్రాహ్మణుడు కథ వింటున్న శ్రోతలకు 'పులి అమాయకముగా నక్క చెప్పినదే తడవు బోనులోకి ఎట్లా జొరబడుతుంది? దానికి అనుమానముకలగదా?' అన్న సందేహము కలుగుతుంది. ఈ సందేహాలనన్నిటిని తీర్చే నేర్పు కథచెప్పేవారికి ఉండాలి. సాధ్యమయినంతవరకూ సందేహాలు కలగకుండా ఉండేటట్లు చెప్పటాన్ని అలవర్చుకోవాలి. శ్రోతలందరూ ఏకాగ్రధ్యానముతో వినేటట్టు చెప్పాలి బాలసంఘాన్ని ఆకర్షించాలంటే తియ్యటిపలుకులతో హృదయమిచ్చి పుచ్చుకోవాలి. బిడ్డలలో ఒకబిడ్డగా మారిపోవాలి అప్పుడుగాని బాలహృదయము పెద్దలకర్థముగాదు. పెద్దలకర్థమయితేనేగాని దానికి రూపురేఖలను దిద్దలేరు. ★

# బాలసాహితి

# అమాయకులు

(గత సంచిక తరువాయి)

సునందుడు కూడా అత్తారింటికి బయల్దేరాడని చెప్పుకున్నాంకదూ! అతడు ఒక గంట నడిచేసరికి అలసట వచ్చేసింది. కాస్సేపు యెక్కడైనా విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు...అందుకని ఒక పెద్ద వట వృక్షంక్రింద పైగుడ్డ క్రింద పర్చుకుని చారగిలపడ్డాడు. కాని ఇంతలో ఒక ఆలోచన తట్టింది. తను యెలాగూ అటుకులు పట్టుకున్నాడు గనుక వాటిని మట్టిపాత్రలో నానవేసి కాస్సేపు నిద్రపోయి లేచాక వాటిని తినేయవచ్చనుకున్నాడు... అలా ఆలోచన రావటమే తడవుగా చప్పున లేచి దూరంగా కనిపిస్తున్న చెరువుదగ్గరికి పోయి మట్టి పాత్రతో నీళ్లు తెచ్చాడు. అందులో తను తెచ్చిన అటుకులు వేసి మళ్ళీ పక్కపై చారగిలబడ్డాడు. కాని, అతని కొక అనుమానం తట్టింది. అసలే అది రహదారి...యెంతో మంది తిరుగుతూవుంటారు. ఎవరేనా ఆ పాత్ర తస్కరిస్తారేమో! అన్నవిషయం తట్టడంతో ఇంకేమీ ఆలోచించకుండా పాత్ర దగ్గర్లో వుంచుకుని యెడమ చేతిని పాత్రలో వుంచాడు. అందువల్ల పాత్రకి కప్పుగానూ వుంటుంది-యెవరూ దాన్ని తస్కరించనూలేరు ... తనయుక్తి బాగా వుందనుకుని నిశ్చింతగా నిద్రపోయాడు సునందుడు.

నిద్రనుండి సునందుడు మేలొనేసరికి సూర్యుడు పశ్చిమాద్రిని వున్నాడు. అత్తవారి వూరు మరో గంటప్రయాణం వుంటుంది. అయినా తను కాస్త ఫలహారం చేసి బయలుదేరేసరికి ఆవేళ అవుతుందనుకుని చప్పున లేచి కూర్చున్నాడు. కాని అతని ఎడమచేయి భారంగా వుంది. ఏమిటా, అని చూశాడుకదా ఆ మట్టిపాత్రకూడా చేతిని అంటిపెట్టుకుని వుంది. అది చూడ్డంతో ఆ బ్రాహ్మడి పంచప్రాణాలు అమాంతంగా యెగిరిపోయాయి. ఏదో భూతం అందులో ప్రవేశించి తనని ఆవేశించిందనుకుని భయకంపితుడయ్యాడు...అయితేఅప్పట్లో యేం చేయాలో ఒకంతట అర్థంకాలేదు. ఇంతదూరమూ వచ్చి యింటి కెలా పోతాడు? అయినా తను పనిమీద వెళ్తున్నాడాయె... యిలా అనుకుని సునందుడు వేరే వుపాయం లేక పైగుడ్డను చేతులచుట్టూ కప్పుకుని ముందుకి ప్రయాణం సాగించాడు.

చీకటి పడుతోందనగా అత్తవారిల్లు చేరుకున్నాడు. అల్లుడు అకస్మాత్తుగా రావటం చూసి అత్తమామలు ఆశ్చర్యపోయారు. పలకరింపులు, క్షేమ సమాచారాలు తెలుసుకోవటం యధావిధిగా జరిగిపోయాయ్..కాని అల్లుడు వళ్లంతా పైగుడ్డతో కప్పుకొని వుండటం వాళ్ళకేం అర్థంకాలేదు. "జ్వరంగాని వచ్చిందా! నాయనా!" అంది అతని అత్త. సునందుడికి యేం చెప్పాలో అర్థంకాలేదు. భూతం పట్టుకుందంటే వాళ్ళంతా నవ్వుతా

'దిలీప్'

(బెంగాల్లో చెప్పుకొనే ఒక కథ ఆధారంగా)

రేమో ననుకుని "ఔ నత్తయ్యా! జ్వర మొచ్చినట్టుంది..." అనేశాడు.

"అయ్యో నాయనా! యిదేం ఖర్మ — మా యింట్లో అడుగు పెట్టావో లేదో జ్వరం పట్టుకుందా! అంతా మా దురదృష్టం...గదిలోకి పద నాయినా!" అంటూ కూతురున్న గదిలోకి తీసుకుపోయి మంచంపై పరుండబెట్టింది. ఆ రాత్రి అతనికి భోజనం పెట్టలేదు. కాసిన్ని కాఫీచుక్కలు మాత్రం కాచి సునందుడి భార్య అతని నోట్లో పోసింది. విచిత్ర మేమిటీ అంటే వళ్లునిండా కప్పుకున్నాడు గనుక జ్వరమే వచ్చి వుంటుందనుకున్నారుగాని, అసలు విషయం యెవరూ తెలుసుకోలేదు.

ఇంట్లో వాళ్ళందరి భోజనాలూ పూర్తి అయినాక సునందుడి భార్య వాళ్ళమ్మకి తోడుగా పనులన్నీ చక్కబెట్టుకుని తనగదికి వచ్చేసింది. అతని నుదుటిపై చేయివేసింది... అబ్బే! చల్లగా వుంది. ఆమె కనుమానం తగిలింది జ్వరం రాలేదని.

"నిజంగా చెప్పండి—మీకు చలి వేస్తోందా?" అంది ధాటీగా. సునందుడికి భార్యయందున్న అభిమానం ప్రేమలవల్ల అబద్ధం చెప్పాలనిపించలేదు.

"లేదు..." అన్నాడు మెల్లగా.

"మరెందుకిలా కప్పుకున్నారు!" అంటూనే అతడు కప్పుకొన్నపై గుడ్డను తొలగించింది. సునందుడు భయం, అవమానం ఒక్కసారి ఆవహించగా లేచి నిల్చున్నాడు. అతని మెడను చేతికి ఆ మట్టిపాత్ర అలాగే వుంది ... అతని భార్య కది చూశాక నవ్వాగింది కాదు.

"ఇదేమిటండీ?" అందామె నవ్వుతూనే. సునందుడి కళ్లు నీళ్ళ పర్యంతమయ్యాయ్. తన కథ అంతా చెప్పాడు. ఆమె తనభర్త అమాయికత్వానికి ఫక్కున నవ్వింది. - తన భర్త యింత లోకజ్ఞానహీనుడని ఆమె కిప్పుడు తెల్సింది.

ప్రక్కగదికి పోయి ఒక చిన్న కర్ర చేతపుచ్చుకుని అతని వెనుకగా వచ్చి ఆ కర్రతో దభీమని మట్టిపాత్రపై కొట్టింది...మట్టిపాత్ర లెక్కలేనన్ని ముక్కలైంది. సునందుడు ఆశ్చర్యంగా తనచేతిని చూసుకున్నాడు. వుబ్బిన అటుకులు యింటినిండా పడివున్నయ్ ... తన భార్య భూతాన్ని వదిలించిందన్న దృఢనమ్మకంతో భార్య కాళ్ళపై పడ్డాడు. ఆమె దేవతా స్వరూపిణి అంటూ స్తోత్రం చేశాడు ... అలా తెల్లవారేవరకూ భార్య పాదాలు పట్టుకునే నిద్రపోయి తెల్లవారిందనగానే అపురూప నగరానికి ప్రయాణం కట్టాడు.

అసలు సునందుడి విషయంలో జరిగిందేమిటీ అంటే పాత్రలో నీళ్లు పోసి అటుకులు నానవేశాడు కదూ! అవి నీటిలో నాని వుబ్బిపోయాయ్...ఆ వుబ్బడంలో సునందుడి చేయికి చుట్టూ చేరి అటుకులు వుబ్బిపోయి యెండిపోయాయ్... అందుకని పాత్ర ఒకంతట వచ్చింది కాదు. దాన్ని భూతమని భయపడ్డాడు తెలివితక్కువ సునందుడు. ఇదంతా వూహించిన అతనిభార్య అతను వెళ్ళిపోయాకకూడా నవ్వుకుంది. ఈ సంఘటన యెప్పటికీ ఆమె మర్చిపోలేదు.

* * *

పోతే మిగిలినవాడు మల్లయ్య. అతడు కూడా యింటినుండి బయల్దేరాడనుకున్నాంగా! తండ్రినుండి పుచ్చుకున్న అయిదురూపాయలూ జేబులో వేసుకుని బజారువేపుకి వెళ్లాడు. అక్కడ అన్ని కొట్లూ తిరిగి తండ్రి చెప్పినవిధంగా 'అవీ, యివీ, వుందా?' అని అడిగేడు. ప్రతికొట్టువాడూ నవ్వుకుని "అవీ యివీ యేమిటి నీ మొహం-పిచ్చివాడిలా వున్నావ్. పో!" అంటూ కసిరేవారు. మధ్యత్రోవలోనైనా ప్రయత్నించవచ్చునుకుని ప్రయాణం సాగించాడు మల్లయ్య. రెండు మూడు చిన్నగ్రామాలు దాటాడు. అక్కడ అసలు కొట్లు లేనేలేవు.

ఇలా పోతూవుండగా ఒక చెరువు గట్టుపై ఒకాయన చిన్న మేదర బుట్టలో యేవో తీసుకుపోతుండటం చూశాడు మల్లయ్య.

"అవేమిటి తీసుకుపోతున్నావ్?" అని అడిగాడు.

"ఏవో అవీ, యివీ," అనేసి పోసాగాడా వ్యక్తి.

ఆ దేశంలో కొన్నిచోట్ల ఒక ఆచారం వుంది. భర్త చనిపోతే భార్య మరో గ్రామంలో వుంటే ఆమెకి తెలియజేసేందుకు పసుపు, కుంకుమ, గాజులు ... ఒక చిన్న పెట్టెలో వుంచి తీసుకుపోతారు... వాటిని చూసే అర్థంచేసుకోవాలి యెవరైనా, ఆ వస్తువుల్నే తీసుకుపోతున్నాడా మనిషి. వాటి పేరెందుకు చెప్పాలీ అని 'అవీ, యివీ' అనేశాడు. మల్లయ్యకి సరిగ్గా తండ్రి చెప్పిన మాటలు జ్ఞాపకానికొచ్చాయి. ఇప్పటికి గామోసు తనకి కావల్సిన 'అవీ, యివీ' దొరికాయి అనుకుంటూ సందడి పడి:

"ఇదిగో ... నేను అయిదు

#  అమాయకులు 

రూపాయ లిస్తాను...ఆ 'అవీ యివీ' నాకిచ్చేయి"అంటూ అయిదురూపాయలు తీసి చేతపట్టుకున్నాడు. బుట్ట పట్టుకున్న వ్యక్తి పరమలోభి—ధనాశాపరుడు. పట్టుమని చూస్తే ఆ వస్తువులన్నీ అర్ధరూపాయి విలువ చేయవు ... అయిదు రూపాయ లిస్తుంటే యింకేం గావాలి? మళ్ళీ బజారులో కొనుక్కొని తీసుకు పోవచ్చు" ... అనుకుని మారు మాటాడకండా అయిదు రూపాయలు తీసుకుని బుట్టని మల్లయ్యకి అందించాడు. మల్లయ్య అందులో యేమున్నాయో కూడా తెరిచి చూడనైనా చూడకండా తీసుకు పోయాడు. ఆ మనిషి సంతోషంగా తనవూరువేపు నడిచాడు మళ్ళీ కొనుక్కొందుకా వస్తువులు.

మల్లయ్య, అన్న అత్తవారి యిల్లు చేరుకున్నాడు. మరిది వచ్చినందుకు వదిన యెంతో సంతోషించింది. ఆమె పిల్లలు మల్లయ్య చుట్టూ మూగారు. వదినకి ఆ బుట్ట చూశాక అందులో యేముందో చూడాలనిపించింది. "ఏవిఁటవి?"అని అడక్కొండానే ఆమెబుట్టను తెరిచింది. ఇంకేముంది? ఏడుపు లంకించుకుంది...ఆమె తల్లికూడా యేడుపు మొదలుపెట్టింది..పిల్లలు యేడ్చారు. అంతా యేడుస్తున్నారని మల్లయ్య కూడా యేడ్చాడు. వాళ్ళంతా యెందుకేడుస్తున్నారో అని తెలుసుకోకండానే యేడ్చాడు ... కొందరు పరాయి బంధువులు వచ్చి పరామర్శ చేసిపోతున్నారు..చివరికి మల్లయ్యకి తెలిసివచ్చిందేవిఁటీ అంటే—వదిన విధవరాలయ్యిందని; నిజమేగామా లనుకున్నాడు.

తెల్లవారుఝామున లేచి స్వస్థలానికి బయల్దేరాడు...వదినకి చెప్పిపోవాలని ఆమెదగ్గరికి వెళ్ళాడు. ఆమె యింకా కంట తడిపెడుతూనే వుంది. మనిషి బొత్తిగా నీరసించిపోయింది.

"వెళ్లొస్తా నొదినా" అన్నాడు. ఆమె యేడుపుస్వరం మరింత పెద్దది చేసింది. మల్లయ్యకేం అర్థం కాలేదు.

అపురూపనగరం వేపు వడివడిగా నడిచాడు...చాలా త్వరగానే చేరుకున్నాడు. మొదట పిచ్చయ్యశాస్త్రి యింటికే వెళ్లాలనుకున్నాడుగాని, వదిన విషయం, అక్కడివాళ్ళంతా యేడిచారన్నవిషయం చెప్పాలనుకుని తిన్నగా యింటికే పోయాడు.

"వచ్చేశా వేమిట్రా... అంతా క్షేమంగా వున్నారా?" ద్వారం దగ్గరే యెదురై అడిగాడు తండ్రి.

"ఏం క్షేమం నాన్నా! నేను వెళ్ళగానే అంతా యేడ్చారు..వదినయితే మరీ యేడ్చింది..." అన్నాడు మల్లయ్య విచారంగా.

"ఎందుకూ?" అయోమయంగా

"ఈ భూప్రపంచంలో, అసలు శత్రువులంటూ లేని వారు ఎవరైనా ఉన్నారంటే, వారు డాక్టర్లే."
"మరే మరే. ఉన్న శత్రువులంతా లోకాంతరంలో కాసుకున్నారు."

అడిగాడు ఆతృతతో మల్లయ్య తండ్రి.

"వదిన 'విధవ' అయిందట నాన్నా!"అంటూ యేడుపులంకించుకున్నాడు మల్లయ్య. అప్పుడే మల్లయ్య అన్నకూడా వచ్చి సంగతంతా తెలుసుకున్నాడు. పెద్దవాళ్లిద్దరూ ఒకారి మొహం ఒకారు చూసుకున్నారు.

"ఇంతకీనువ్వేమైనా చెప్పావా?" అని అడిగారు.

"నేను పిల్లలకోసం నువ్వు చెప్పిన 'అవీ, యివీ' తీసుకువెళ్లా నాన్నా! వాటిని చూసి వదిన యేడ్చింది" అన్నాడు మల్లయ్య. ముసలాయనకి కొంత అర్థమయ్యింది.

"అవీ, యివీ యేమిట్రా నీ మొఖం-ఏవిఁటవి?"

"ఎవరో ఒక మనిషి బుట్టతో సామాను తీసుకెళ్తున్నాడు. ఏవిఁటని అడిగాను 'అవీ, యివీ' అన్నాడు. వెంటనే కొన్నాను..."

"ఏవిఁటేవిఁటి వున్నాయందులో?"

"ఏవో పసుపు కుంకుమ, గాజులు...యింకేమో..."అని చెప్పబోతూ వుంటే ముసలాయన ఉగ్రుడైపోయి మల్లయ్యని ఎడాపెడా నాలుగు వాయించాడు.

బాలగేయం:

# "అల్లుళ్ళ పీడ"

జంధ్యాల స్వర్ణకుమారి

అక్బరు పాషా కొకనాడు
అల్లునిపై అత్యధికంగా
ఆగ్రహమే వచ్చేసింది!
ఆవేశం పెల్లుబికింది!

కన్నుల నిప్పులు గక్కే పాషా
గర్జనలకు కంపించింది
రాజమందిరం గోడల లోపలి
రాళ్లు కూడ భయపడ్డాయి!

ఏదో వినోదం కూరుద్దామని
ఎదుటికి వచ్చిన వీరబలుండు
ఆరూపంలో ప్రభువును చూస్తూ
నోరు మెదల్పక నిలిచాడు.

"వీరబలా! ఈ లోకంలో ఒక
విపరీతం వీక్షించాను!
అల్లుళ్ళంతా అహంకారులై
అధికారం సాగించారు!

పొగరుబోతులై బెదిరిస్తారా!
తెగ నీల్గుడు సాగిస్తారా!

మదాంధకారం కళ్లు కప్పగా
మంచి చెడ్డ గుర్తింపగలేరా!

మమ్ముల సైతం పరాభవించిన
మాయజాతి నిక మన్నింపములే!
నా రాజ్యంలో అల్లుర పీడలు
నాశనమై ఇక పోవాలి!

దేశంలోగల అల్లుళ్ళందరి
కోసం భటుల్ని పంపించు!
అందరినీ ఉరితీసేయిస్తా
అందుకు అన్నీ సిద్ధం చెయ్!"

వీరబలుడు "అల్లాగా" అంటూ
వినయంగా తల వంచాడు!
మందహాస మొలికించాడు
తొందరగా పయనించాడు.

చిరునవ్వులు చిలకరించి,
మరునాడిటు పలికినాడు!
"ఉరిత్రాళ్ళన్నీ సిద్ధమొనర్చితి
పరికింపగ రండయ్యా ప్రభువులు!

అల్లుళ్ళందరి ఆక్రందనములు
అల్లుళ్లందరి అద్భుత మరణం
వీనుల విందుగ వినగా రండి!"
ఆనందమ్మున కనగా రండి!"

పాషా ఖుషీగ వచ్చాడు
హుషారుగా చూస్తున్నాడు.
"వీరబలా! ఈ వెండిత్రాడు-బం
గారు త్రాడు ఏర్పరచావే!

ప్రత్యేకంగా ఎవరికోసమని
పట్టుబట్టి కట్టించావో?"
వీరబలుడు చేదోయి మోడ్చి
వినయంగా ఇటు పలికాడు!

"బంగరు త్రాడిది పాషావారికి
వెండిత్రాడు ఈ వీరబలునికై!
ఆజ్ఞప్రకారం కట్టించా నిట
అల్లుళ్లలో మీరూ నేనూ

అందరితో పాటున్నాంగా!"
ఆ పలుకులు విని నిర్విణ్ణుండై
మరు మాటాడక పాషా అంత:
పురములోనికి నడిచాడు!

మల్లయ్య యిన్ని దెబ్బలు తిన్నా లెఖ్ఖచేయకండా శాస్త్రి యింటికి దారితీశాడు...అప్పటికే తతిమ్మా ముగ్గురూ వచ్చి వున్నారు. వీణ్ని చూడ్డంతోనే పిచ్చయ్య శాస్త్రి నవ్వుతూ:

"నువ్వొక్కడివే మిగిలావురా! వీళ్ళ ముగ్గురూ వాళ్ళ కథలు చెప్పారు...నువ్వూ మొదలుపెట్టు" అన్నాడు. మల్లయ్య సవిస్తరంగా జరిగిందంతా తండ్రి తనను కొట్టిన వరకూ చెప్పాడు.

పిచ్చయ్యశాస్త్రి అంతా విని కడుపుబ్బేటట్టు నవ్వాడు. నలుగురూ ఒక్కలాంటివాళ్లే అనుకున్నాడు మనసులో...అతను యేం తీర్మానం చెప్తాడోనని నలుగురూ ఆత్రంతో చూస్తున్నారు.

"మీా నలుగుర్నీ పరిహసించ డానికి నమస్కరించాను...అంతే గాని ప్రత్యేకించి యెవరికీ నమస్కరించలేదు...ఇక వెళ్ళండి...ఇలాంటి పందెం యెప్పుడూ వేసుకోకండి... తెలిసిందా?" అన్నాడు శాస్త్రి. నలుగురూ మొహాలు వేలేసుకుని అక్కణ్ణించి జారుకున్నారు... కథ కంచికీ-మనం యింటికీ!

# నేటి బాలలే రేపటి పౌరులు

రామనాథంగారు జమీందారు కాకపోయినా ధనవంతు డనే చెప్పాలి. ఉన్నతాశయాలు కల వాడూ గౌరవమైనవాడూను. ఊళ్లో పెద్దా, చిన్నా రామనాథంగారంటే ఎంతో గౌరవించేవారు.

రామనాథం గారు కుర్చీలో కూర్చొని పేపరు చదువుతున్నారు. భార్య లక్ష్మి కాఫీ తీసుకొచ్చింది. భార్య చేతిలో కాఫీ తీసుకొంటూ టైము చూసి "రామూ, శశీ ఇంకా రాలేదు 4½ అయిందే" అన్నారు. ఇంతల్లో రామూ, శశీ స్కూలు నుంచి వచ్చి రావడంతోనే పుస్తకాలు వాళ్ళమ్మ చేతికిచ్చి "నాన్నగారూ మన వూళ్లో అమ్మవారి జాతర వుందిట. ఊరంతా రంగు కాగితములతో రకరకముల బుట్టలు కడతారుట! ఇంకా రంగు కాగితముల తోరణాలుకట్టి ఎంతో బాగా చేస్తారుట" అని రామూ గుక్క తిప్పకుండా చెప్పేడు. అంతా ఆశ్చర్యంగా వింటూంది శశి. "అంతా బాగానే వుంది కాని," అంది లక్ష్మి.

"కానీ ఏమిటమ్మా? కానీ, అర్థణా!" అని నవ్వింది శశి.

"అది కాదే చిట్టితల్లీ, అమ్మవారి పేరిట ఎన్నో గొఱ్ఱెలను, మేకలను, కోళ్ళను చంపుతారు" అంది లక్ష్మి.

"పాపం కదూ!" అంది శశి.

"నోరూ, వాయీ లేని అమాయక జంతువులను చంపితే పాపం కాకపోతే మరేమిటి" అంది వాళ్ళమ్మ.

"అయితే ఎందుకమ్మా దరూ, దాక్షిణ్యం లేక అమాయక జంతువులను చంపుతారూ?" అని అమాయకంగా అడిగేడు రామూ.

"గ్రామానికి ఒక దేవత వుంటుంది. ఆమె ఆ గ్రామంలో వుండే జీవరాసులను రక్షిస్తూ వుంటుంది ఆమె చల్లగా కాపాడినందుకు వూరివారంతా ఎంతో సంతోషంతో ఆమెకు పసుపు, కుంకుమ, పువ్వులతో పూజచేసి, పండ్లూ, ఫలాలూఇచ్చి తల్లీ గ్రామదేవతా మమ్మలను చల్లగా, హాయిగా కాపాడు తల్లీ అని ప్రార్థిస్తారు" అంది వాళ్ళమ్మ.

"అయితే జంతువులను చంపడమెందుకు?" అంది శశి.

"అమ్మవారు కోళ్ళను కోరింది అని కొందరూ, గొఱ్ఱెలను కోరింది అని కొందరూ, మేకలను కోరింది అని కొందరు మూర్ఖంగా చంపుతారు ఆమె పేరుమీద ఆ రోజున ఎన్నో జంతువులు చంపబడతాయి.

సింహాద్రి
రుక్మిణీ కుమారి

పూర్వం పశువులను కూడా బలిచేసే వారు. ఇది చాల అన్యాయం" అంది లక్ష్మి.

ఇదంతా వింటూవున్న రామూ, శశీ కళ్ళవెంట జలజలా కన్నీరు కారింది.

"గాంధిగారు 'జంతువుల్ని, చేపల్ని తినకూడదు. వాటికీ ప్రాణం వుంది. అవీ మనలాగే బాధపడతాయి' అన్నారుకదా! మరి గాంధిగారు చెప్పింది వినరేం" అన్నాడు రాము.

"అన్ని ధర్మాలలో అహింసే గొప్ప ధర్మమని బుద్ధుని ఉపదేశం వినలేదూ? వీళ్ళంతా జ్ఞానం లేని మూర్ఖులా? మరి మా బడి ఇన్‌స్పెక్టరుగారు మాంసం తింటారుకదా, మరి వాటి అమాయకపు చూపులు జ్ఞాపకంవస్తే తిన బుద్ధిపుడుతుందా?" అంది శశి.

వీళ్ళ సంభాషణ అంతా వింటున్నారు వాళ్ల నాన్నగారు.

రామూ, శశి ఏక కంఠంతో ఇలా అన్నారు. నాన్నగారూ, అమ్మా వినండి - మా బడిపిల్లలమంతా కలసి, జరగబోయే ఉత్సవంలో ఏ జంతువునీ చంపకుండా ఈ అన్యాయాన్ని, అవినీతినీ మాన్పించి బుద్ధుని ఉపదేశాలతో, గాంధిజీ అడుగుజాడల్లో అశోకుని ధర్మచక్రంపట్టి భారతమాత ముద్దుబిడ్డలమై వారి ఆశయాలను తీర్చి

"రామరాజ్యాన్ని స్థాపిస్తాం" అని అంటూవుంటే శశినీ రామునీ చూచి పట్టరాని ఆనందం పొందేరు వాళ్ళ నాన్నగారూ అమ్మానూ!

మర్నాడు బడిపిల్లలంతా కలిసి పెద్ద సభ చేసేరు. సభకి వచ్చి మా కోర్కె మన్నించాలి అని పెద్దల నందరినీ పిల్చారు. వీళ్ళ వుద్దేశా లేమిటో చూద్దాం అని పెద్దలంతా వెళ్ళేరు. మాట తియ్యకుండా వచ్చినందుకు పెద్దలకు ధన్యవాదాలర్పించి ఉపన్యసించడం మొదలు పెట్టేడు రాము.

"మన గ్రామంలో ప్రతి సంవత్సరము అమ్మవారి ఉత్సవం జరుగుతుంది. అంతా ఎంతో సంతోషంతో జరుపుకుందాం! కానీ ప్రతి సంవత్సరము అమ్మవారి పేరుతో ఎన్నో ప్రాణులను బలిచేస్తున్నారు. సకల జీవరాసులను కాపాడే ఆ తల్లి ఎప్పుడూ తన బిడ్డలను తాను బలికోరదు. కానీ తెలివితక్కువగా అనేక ప్రాణాలు తీస్తున్నారు. జరుగబోయే ఉత్సవంలో అలాంటివి జరుగకుండా ప్రశాంతంగా సంతోషంతో ఆ తల్లిని ప్రార్థించాలి. ఇదే మా ఉద్దేశం. పెద్దలైన మీరు మా ఈ కోర్కెలను తీర్చి బుద్ధభగవానుడు, అశోకుడు, గాంధిగారు తదితర పెద్దలు చూపిన బాటల్లో నడచి పెద్దలైన మీరు మమ్ము అదేబాటలో నడిపిస్తారని మేమంతా దృఢంగా నమ్ముతున్నాము" అని తన ఉపన్యాసాన్ని ఆపాడు రాము.

"మీ రన్నది బాగానే వుంది. కానీ - ప్రతి సంవత్సరం జరిగినట్లే ఈసారి కూడ జరగాలి. లేకపోతే అమ్మవారికి కోపం వస్తుంది. బలి జరగాలి, కాని మానడానికి వీల్లేదు. మీకేం తెలుసు కుర్రకుంకలు" అన్నారు పెద్దలంతా.

"అలా జరగడానికి వీల్లేదు. వాటి ప్రాణాలకి మా ప్రాణాలు అడ్డంవేసి అయినా నిలబడతాము!" అన్నారు పిల్లలు ఏకగ్రీవంగా.

"ఈ ఆటంకాలు ఎలాంటివో మనం చూద్దాం" అంటూ వెళ్ళారు పెద్దలు.

ఎన్ని కష్టాలైనాసరే వాటిని చంపకుండా చెయ్యాలి అని దృఢ నిశ్చయంతో పిల్లలంతా ఎవరి ఇంటికి వారు వెళ్ళిపోయారు.

పిల్లలంతా కలిసి వూరూరా తిరిగి జరుగబోయే ఉత్సవంలో మాకు సహాయం చెయ్యండి అనీ కొన్ని ప్రాణాలను కాపాడినవారు అవుతారనీ ప్రచారం చెయ్యడం మొదలుపెట్టేరు. ఊర్లో వారైతే నేమి పై గ్రామాల వారైతేనేమి చిన్నా, పెద్దా జరుగబోయే ఉత్సవంలో పెద్ద అల్లరి జరుగవచ్చునని అనుకొన్నారు. తెల్లవారితే ఉత్సవం జరిగే రోజు. పిల్లల ప్రచారం జోరుగా సాగుతూంది. ఇన్నాళ్లూ కుర్రమూక ఏం చేస్తుందని నిర్లక్ష్యంగా వూరుకున్నా, ఎటువంటి అల్లరి జరుగుతుందో అని రిజర్వు పోలీసులు వచ్చారు. ఉత్సవం చూడడానికిఅనీ, పిల్లలకు సహాయం కోసమనీ, పిల్లలూ, జనము తండోపతండాలుగా వచ్చేరు. చిత్ర, విచిత్రమైన వేషాలతో, రంగు రంగుల లైట్లతో, రకరకములైన బ్యాండు మేళములతో, ఉత్సవం బలే వుషారుగా సాగుతూవుంది. రామూ, శశీ, బడిపిల్లలూ వచ్చి రామనాథం గారికి, లక్ష్మికి నమస్కరించి, "మేము వెళ్ళివస్తాము" అన్నారు. "మీకు విజయం చేకూరుగాక!"

## ఆలస్యం ఎందుకు అయింది?

ముగ్గురు పిల్లలు బడికి ఆలస్యంగా వచ్చారు. ఆలస్యం ఎందుకు అయిందో కాగితం మీద రాసివ్వమని మేస్టారు ఆజ్ఞాపించారు.

ఒక పిల్ల ఇలా వ్రాసింది. "ఎందు కంటేనండీ... మరీ... నేను ఒచ్చేసరికే బెల్లు కొట్టేశారండి. అందుకూ ఆలిశ్యం అయింది."

ఇంకో అబ్బాయి భయంలో అసలు మాట మర్చిపోయి ఇలా వ్రాశాడు.

"నేను వచ్చినందుకు క్షమించండి. ఇంకెప్పుడూ ఇలా రాను."

ఇంకో సత్యవతి వ్రాసిన సమాధానం.

అసలు నేనేమో పొద్దున్నే హోం వర్కు చేస్తున్నానండి. మరేమో మా నాన్న నాకు లెక్కలు చెప్తా రమ్మన్నారు. ఆయన అవన్నీ చేసేసరికి చాలా నేపయిందండి. మళ్ళా నేమో ఆన్సర్సు చూస్తే అన్నీ తప్పులైపోయాయి. అందుకనేమో మా నాన్నని భోజనానికి వెళ్లనిచ్చి ఆ లెక్కలన్నీ నేను మళ్లీ చేసుకు వచ్చానండి. అందుకూ లేటు."

# ★ నేటిబాలలే రేపటి పౌరులు ★

అన్నారు, రామనాథంగారు. కుంకుమ తెచ్చి అందరి నొసటా బొట్టుపెట్టింది లక్ష్మి. 'గాంధిగారికీ బుద్ధభగవానునికీ, అశోకచక్రవర్తికీ, భారతమాతకీ' అని వీరనాయకుల దేశనాయకుల పేర్లు ఒకరు అంటూ వుంటే అంతా జైజై నినాదాలతో ఉత్సవంలో కలిసిపోయారు! ఉత్సవం గుడిదగ్గరగా వస్తూవుంది. అల్లరి ఎక్కడ జరుగుతుందో అని పోలీసులు వెయ్యికళ్ళతో కాపాడుతున్నారు. గుడిదగ్గర అనేక జంతువులు నిలబడి వున్నాయి. ఇంక బలివేసే వాటిదగ్గరకు వచ్చేరు. ఇంక కత్తులు వాటి పీకలమీద పడడమే తరువాయి. ఉన్నట్లు వుండి పిల్లలంతా వాటి కడ్డంగా నిలబడ్డారు.

"అడ్డులేవాలి" అన్నారు పెద్దలు. "వీల్లేదు" అన్నారు పిల్లలు. "వాటిని చంపాలి" అంటే "మమ్మల్ని చంపి వాటిని చంపండి. లేకపోతే వాటిమీద చెయ్యివేసే అధికారం మీకు లేదు" అన్నారు పిల్లలు. "లేవాలి" అన్నారు పెద్దలు. "వీల్లేదు" అన్నారు పిల్లలు. పెద్దలు పిల్లల మీద కలియబడ్డారు. పిల్లలు పెద్దవాళ్ళను కొట్టలేదు, తిట్టలేదు. ఆ జంతువులను మాత్రం పదిలంగా పట్టుకొన్నారు. "ఇది న్యాయం కాదు" అన్నారు. వెంటనే పిల్లలందరిమీద దెబ్బలవర్షం కురిసింది. రామూకి నొసలుమీద రక్తం కారుతూ వుంది. శశి మేకను గట్టిగా పట్టుకొనడంవల్ల చేతులకి బలంగా గాయాలు తగిలాయి. తదితర పిల్లలకు వీపులమీద, కాళ్లమీద, భుజములమీద లెక్కలేకుండా దెబ్బలు తగుల్తూవున్నాయి. కానీ వారి కార్యదీక్ష మాత్రం దెబ్బతినడంలేదు. ఇంతలో పోలీసులు పెద్దలను ఆపుచేసి, అల్లరి అంతా తగ్గేటట్లు చేసేరు. ఇంతలో ఎక్కడినుంచో జనం కోలాహలం వినిపించింది. అంతా అటువేపు చూసేరు. చిన్నా పెద్దా అంతా పూలమాలలతో వచ్చి బాలవీరుల మెడలలో వేసి హారతులిచ్చి ఘనంగా స్వాగతం ఇచ్చారు. ఈ సంఘటన అన్ని పత్రికలలోను ప్రచురించబడింది. ఎక్కడ విన్నా బాలవీరులను ప్రశంసించేవారే. రామూ, శశీ తదితర పిల్లలకీ, బలంగా గాయాలు తగలడంవల్ల హాస్పటలులో చేర్చబడ్డారు. ఆ తరవాత కొన్నాళ్ళకి పిల్లలంతా ఒకచోట కూర్చొని జరిగినది చెప్పుకుంటూ వున్నారు. ఇంతలో రామనాథంగారూ, లక్ష్మి నవ్వుకొంటూ వచ్చారు.

"ఏమిటి నాన్నగారూ, అమ్మా నవ్వుతున్నారు" అన్నాడు రాము. "బాలలతరఫున, మన ప్రభుత్వమువారు బంగారు పతకము ఈయదలిచేరట. వచ్చే ఒకటో తారీకున వస్తారుట" అన్నారు రామనాథంగారు.

ఆ రోజున అంతా కలసి పచ్చని అరటిచెట్లతోను మామిడి తోరణాలతోను, రంగు కాగితములతోనూ, పూలమాలలతోనూ, అలంకరించారు. స్పెషల్ ట్రయిన్‌లో వచ్చారు గవర్నరుగారు. అందరూ ఆయనకు పూలమాలలువేసి తీసుకొని వచ్చారు. గవర్నరుగారు మాట్లాడుతూ "పిల్లలు చూపిన ధైర్యసాహసములకు, కార్యదీక్షకు మెచ్చి మేమీ బంగారు పతకమును వేయుచున్నాము" అన్నారు. "మన పిల్లలంతా మన దేశనాయకుల అడుగుజాడల్లో నడుస్తారని ఆశిస్తాను" అన్నారు. ప్రతివ్యక్తికీ పరోపకారదీక్ష, న్యాయం, ధర్మం వున్నట్లయితే దేశం దానంతట అదే బాగుపడుతుంది" అని అన్నారు.★




## 6. ఎవరిగుఱ్ఱం వేగం తక్కువ?

'చూడు బాబూ, పరబ్రహ్మం! నీకె ఎన్నివిధాల కష్టాలు వచ్చినా మీ అన్న వున్నాడే అపరబ్రహ్మం, వాడు మీ నాన్నగారి పెద్దభార్య కొడుకు. నువ్వు ఎంత గొప్పవాడివయినా దురదృష్టవంతురాల్ని, చిన్నదాన్ని, నా కడుపున పుట్టేవు-కాబట్టి నీకు సరిగ్గా జరగదు. అంచేత నేను చెప్పే దేమిటంటే-వాడికేం కావాలో అదే నీకూ కావాలని పేచీపెట్టు. మీ అన్న ఏం చేస్తే సరిగ్గా అదే చెయ్యి' అని చిన్నప్పట్నుంచీ పరబ్రహ్మానికి వాళ్లమ్మ బోధించింది. వాడూ అలా చెయ్యడానికే ఎప్పుడూ ప్రయత్నించేవాడు.

బ్రహ్మంగారి పెద్దభార్యకొడుకు అపరబ్రహ్మానికి సరిగ్గా చదువు అబ్బేదికాదు. అన్నదమ్ము లిద్దరూ కూర్చుని చదువుకొంటూండగా వాడికి గాలిపడగలు జ్ఞాపకం వచ్చేవి. పుస్తకాలు అలా వదిలేసి గాలిపడగ తీసుకుని వెళ్లిపోయేవాడు. చదువుమీద సరదా ఉండి ముందుకు రావలసిన చిన్నవాడు పరబ్రహ్మంకూడా పుస్తకాలు వదిలేశేవాడు. 'వాడికేం కావాలో దానికే నేను పేచీ పెట్టాలి. వాడేం చేస్తే అదే నేను చెయ్యాలి. అదేగా అమ్మ చెప్పింది!' అనుకునేవాడు పదహారేళ్ల పరబ్రహ్మం. ఆఖరికి ఆ ఆలోచనతోనే అన్నతో పోటీ చెయ్యడమే పరమార్థంగా అన్నీ వదులుకుని పరబ్రహ్మం పాతికేళ్లవాడయాడు.

చదువుకోసం డబ్బిచ్చి పొరుగూరు పంపిస్తే ఆ డబ్బుపెట్టి ఒక గుఱ్ఱం కొనుక్కుని దానిమీదెక్కి అపరబ్రహ్మం యిల్లు చేరుకుంటే పరబ్రహ్మమూ అచ్చు అలాగే చేశాడు!

ఆ రోజు మొదలు ప్రారంభమయింది ఇద్దరికీ అసలయిన కాంపిటీషన్!

అపరబ్రహ్మం తన గుఱ్ఱానికి 'టకటకా' అని పేరుపెట్టేడు.

వెంటనే పరబ్రహ్మం తన గుఱ్ఱానికి 'చకచకా' అని పేరు పెట్టేడు.

నా గుఱ్ఱం త్వరగా వెడుతుం దంటే నా గుఱ్ఱం త్వరగా వెడుతుందని ఇద్దరూ అల్లరి.

కాని ఇద్దరికీ తెలుసు, వాటి స్పీడు ఎంతో! ఆ గుఱ్ఱాలు పరుగెడుతుండగా మనం దిగిపోయి పక్కనున్న చెరువులో స్నానంచేసి మళ్లీ గుఱ్ఱాలను ఎక్కవచ్చు.

అంత చకచకా, టకటకా అవి పోగలవు!

అందుకనే నోటిమాటలేగాని గుఱ్ఱాల వేగం పోటీకి ఎవడూ ముందుకు రాలేదు.

ఇలా ఉండగా ఒకసారి ఆ యిద్దరూ ఆ వూళ్లో జరిగిన స్లో సైకిలు రేస్ చూశారు.

ఎవరిసైకిలు అతి నెమ్మదిగా నడుస్తే వాడికిస్తారు ప్రైజు. అది చూసినతరువాత అపరబ్రహ్మం తెలివి పువ్వు విడినట్లు విడింది. 'ఇలాంటి స్వల్పవేగ పోటీలు గుఱ్ఱాల్లో ఉండవా?' అని అక్కడి వాళ్లను వాకబుచేశాడు. వాళ్లు నవ్వి లేదని చెప్పగానే 'ఎవళ్లదారి వాళ్లది. సైకిళ్లపాటి చెయ్యాక

రచన: అవసరాల రామకృష్ణరావు

## ★ సమస్యల తోరణం ★

పోయ్యాయా గుఱ్ఱాలూ! నా గుఱ్ఱమంత నెమ్మదిగా మరే ఱ్ఱమూ నడవలేదు!' అని ాలెంజ్ చేశాడు అపరబ్రహ్మం.

అన్నా! ఉండుండి అన్న బలే ఎత్తు వేశాడే! అనుకుని పరబ్రహ్మం 'ఏమయినా నా గుఱ్ఱం నీ గుఱ్ఱం కన్న మందయానసుమీ!' అని సవాలు చేశాడు.

'ఇదేం పోటీ ఎవరేనా నవ్వుతారు? మీ రిద్దరూ యీ విషయంలో పందెం వేశారే అనుకోండి...' అని ఎవడో బుద్ధిమంతుడు ఏదో సందేహం లేవ దీయబోయాడు.

'మీరు ఆగండీ...నా గుఱ్ఱానికి అంత తొందరపాటు లేదు. ముందూ వెనకా చూసుకుంటూ ఎంచక్కా మెల్లగా చల్లగా పెళ్లికూతురిలా నడుస్తుంది' అన్నాడు అపరబ్రహ్మం.

'కావచ్చు. కాని మా చకచకకున్న నిదానం మీ టకటకకి జన్మలో రాదు. నిదానం ప్రధానం అన్నారు! మా పంచకల్యాణి అడుగుదీసి అడుగువెయ్యడం అంటే బ్రహ్మాండం కాదండీ! కావలిస్తే నేను నూర్రూపాయలు పందెం కాస్తాను.'

'నేనూను!' అన్నాడు అపరబ్రహ్మం. సామాన్యుడు తన సందేహాన్ని మళ్లీ చెప్పేడు.

'అది కాదండీ. మీరు పందెం కాశారే అనుకోండి. మీ అన్నగారు టకటకనీ మీరు చకచకనీ నడుపుతారు, అవునా? అయితే ఆ గుఱ్ఱాల స్పీడే అంతో లేక మీరు తగ్గించి నడుపుతున్నారో మా కెలా తెలుస్తుందీ? అయితే అది పందె మెలా అవుతుందీ?'

అన్నదమ్ము లిద్దరూ తెల్ల మొగాలు వేశారు.

'పోనీ మీలో యిద్దరు వచ్చి మా గుఱ్ఱాల్ని నడపగూడదూ? అవి ఎంత మెల్లిగా వెళ్లగలవో, ఎంత గొప్పవో తెలుసుకొస్తుందీ!' అన్నాడు ఆఖరికి పరబ్రహ్మం.

'ఇంతోటి గొప్ప జవసాశ్వాలూ, మీ 'డొంకాడ' గుఱ్ఱాలు ఎక్కి మా శరీరాలు అపవిత్రం చేసుకుంటామా?' అన్నా డొక విదూషకుడు. అందరూ నవ్వేరు.

అయితే మూడో మనిషి ప్రసక్తి లేకుండా ఎవరి గుఱ్ఱం నెమ్మదిగా వెడుతుందో తెలుసుకోడానికిమార్గం లేదంటారా?

ఉంది. అదేమిటో చెప్పకోండి చూద్దాం. ★

---

## గతవారం సమస్యకు జవాబు

---

ఈ సమస్యలో కీలకం రాజు పెట్టిన షరతులో ఉంది.

అసలు రాజుపెట్టిన షరతేమిటి?

కళ్ళగంతలు విప్పగానే ప్రతివాడూ తక్కిన ఇద్దరిలో ఎవరి నుదుట ఎర్రచుక్క ఉన్నా వెంటనే లేచి నిలబడాలి.

ముగ్గురూ లేచి నిలబడ్డారు.

ముగ్గురూ లేచి నిలబడ్డారంటే ఏ పరిస్థితుల్లో నిలబడిఉంటారని మహా తెలివి జాగ్రత్తగా ఆలోచించాడు.

ముగ్గురూ లేచి నిలబడ్డారంటే కనీసం ఇద్దరి నుదుటని ఎర్రచుక్కలు ఉండాలి.

ఆ సంగతి మహా తెలివికే కాదు తెలివి, అతి తెలివికి కూడా తెలుసు.

మహా తెలివికి కళ్ళు విప్పగానే తక్కిన ఇద్దరి నుదుటా ఎర్రచుక్కలు కనిపించాయి.

ఒకవేళ తన నుదుటనే నల్లచుక్క ఉంటే - తక్కిన ఇద్దరి నుదుటా తప్పక ఎర్రచుక్కలు ఉండాలని వాళ్లకు తెలుసు గనుక తెలివో, అతి తెలివో వెంటనే చెప్పేసి ఉండును. కాని వాళ్ళిద్దరూ అలా చెప్పలేదు.

కాబట్టి తనకు నల్లచుక్క లేదు. అంటే? ఎర్రచుక్కే ఉంది.

అని ఆలోచించుకుని మహా తెలివి నిలబడి తనది ఎర్రచుక్కని చెప్పేశాడు.

సూక్ష్మబుద్ధి ముగ్గురికి పెట్టినవీ ఎర్రచుక్కలే! ★

---

# దక్షిణ కైలాసం శ్రీ కాళహస్తి

కాశీ వెళ్ళేవారు గంగను తరించి వ్యాస కాశి వెళ్ళితీరుతారు. ఏడు కొండలవాడిని చూడబోయేవారు, దక్షిణ కైలాసమని ప్రశస్తినందిన శ్రీ కాళహస్తిని సందర్శించిగాని ఇంటిదారి పట్టరు. కమనీయమైన ఈ పుణ్యక్షేత్రం తిరుపతికి 20 మైళ్ళ దూరాన ఉంది.

పృథివ్యప్తేజో వాయ్వాకాశ లింగాల (భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం)లో వాయు లింగం ఈ స్థలంలో వెలిసింది. ఇందుకు నిదర్శనం, గర్భాలయంలో దీపకళిక నిత్యం రెపరెపలాడుతూ ఉండడమే. (మిగతా వాటిలో పృథ్వీ లింగం కంజీవరంలో, ఆపోలింగం తిరుచిరాపల్లి సమీపాన ఉన్న తిరువన కోయిల్‌లో, తేజోలింగం తిరువణ్ణామలైలో, ఆకాశలింగం చిదంబరంలో ఉన్నాయి.)

కాళహస్తిలో వెలసిన దేవతలు కాళహస్తీశ్వరుడు; జ్ఞానప్రసూనాంబిక. ఇక్కడే ఆదిశంకరులు స్వయంగా శ్రీ చక్రాన్ని స్థాపించారు.

మూఢభక్తితో పొంగుతుండిన తిన్నడు ఇక్కడే తన కన్నును ఈశ్వరుడికి అర్పించాడు. ఇక్కడికి సమీపంలోనే, ఈ మహాభక్తుడికి ఒక గుడి వెలసింది. నిత్యం ఇక్కడ పూజా పునస్కారాలు జరుగుతూ ఉంటాయి. తిన్నడినే తమిళులు కణ్ణప్ప నయనార్ అని పిలుచుకుంటారు.

తిన్నడి కథ అలా ఉండగా, 'శ్రీ కాళహస్తి' అన్న పదంలో ప్రత్యక్షరం, నిష్కళంకమైన భక్తిని సేవా తత్పరతనూ ఉపదేశిస్తుంది. శ్రీ, కాళము, హస్తి (సాలీడు, పాము, ఏనుగు) కూడా ఈశ్వరుణ్ణి సేవించి, ఈ స్థలంలోనే శివసాయుజ్యమందాయి.

తీర్థయాత్రా స్థలంగానే కాకుండా, కమనీయమైన ప్రాంతంగా కాళహస్తి సేవ్యమైనది. స్వర్ణముఖినదీతటాన చెట్లూ పుట్టలూ, లతలూ మొదలైనవాటితో నిండిన ఆ ప్రాంతం అంతటిని తిన్నడి కొండ మీద నిలచి పరికిస్తే కన్నుల పండువుగా ఉంటుంది

ప్రాచీనాంధ్రకవి ధూర్జటి కాళహస్తి క్షేత్రం మహత్తును తెలిపే కాళహస్తి మాహాత్మ్యం అనే ప్రబంధాన్ని, భక్తిరసప్రధానమైన కాళహస్తీశ్వర శతకమనే మరొక చిన్న ఖండకావ్యాన్ని వ్రాశాడు. ఈ క్రింద ఉదహరించిన పద్యం ఆ శతకంలోనిది. తెలుగు శతకాల్లో ఇంత చక్కని కవితాసౌందర్యం గల గ్రంథం మరొకటిలేదని చెప్పవచ్చును. ★

ఏ వేదంబు పఠించె లూత? భుజగం బే శాస్త్రముల్ సూచె తా
నే విద్యాభ్యసనం బొనర్చె కరి; చెంచే మంత్ర మూహించె బో
ధావిర్భావ నిదానముల్ చదువు లయ్యా! కావు; నీపాద సం
సేవా సక్తియె కాక జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా!

(ధూర్జటి కవి)




Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



కాళహస్తీశ్వరాలయం: స్వర్ణముఖినది ఈవలిగట్టునుండి కనిపించే దృశ్యం.

ఆలయంలోని ఏనుగు, సర్పము, సాలీడు ప్రతిమలు

ఫొటోలు: ఎన్. రామకృష్ణ.

# నరముల దుర్బలత్వము వస్తే అంతా కోల్పోయినట్లే

★ దురదృష్టము ★ మనస్సంకటము
★ ఘోరమైన పని ★ నిరంతరం మలబద్ధము

...ఇవి నరముల బలహీనతకు సామాన్య కారణాలు.

★ మతిమరుపు ★ భీతి దృక్కులు
★ భ్రాంతి ★ ఆత్మహత్యా ప్రయత్నములు
★ చిత్త విభ్రమము .... ఇవి వీని భయంకర పరిణామములు

## నరముల దుర్బలత్వమును పోగొట్టుకొనుడు.

ప్రపంచ ప్రఖ్యాత ఔషధము.

# ★ నవరత్న-కల్ప ★



రత్నాలు, రవ్వలు, ముత్యాలు ఇంకా మొత్తం తొమ్మిది విలువగల రాళ్లతో తయారైనది.

కవిరాజ్ పండిట్ **దుర్గాదత్తశర్మ**

వైద్య వాచస్పతి వారు కనిపెట్టిన, తయారు చేసిన మందు సేవింపుడు.

వివరములకు ఉచిత లిటరేచర్ కు వ్రాయండి:

## నవరత్న కల్ప ఫార్మసీ,

జలంధర్ సిటీ, (ఇండియా).

తంతి: "NAVRATNA